# ఆంధ్ర ప్రదేశ్

నవంబరు 1977

కార్తీక—ఆశ్వీయుజ, 1899 శా. శ

ప్రధాన సంపాదకులు :

శ్రీ రాజ్యం సిన్హా

సంపాదకులు :

కుందుర్తి ఆంజనేయులు


ముఖచిత్రం :
"కడుబెట్టిదంబగు గాలిచే గూలిన మాహనీయ సాలభూరుహము పోల్కి"

రెండవ కవరు పేజీ :
లక్షలాదిప్రజానీకం నిరాశ్రయులైయ్యారు

మూడవ కవరు పేజీ :
జీవితం రైలు పట్టాలు తప్పింది

చివరి కవరు పేజీ :
సురక్షిత ప్రాంతాలకు........

---

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో నవంబరు 19వ తేదీ శనివారం కాళరాత్రిగా పరిణమించి కోస్తా జిల్లాలలో ప్రజలకు విపరీతమైన ప్రాణనష్టాన్ని, ఆస్తి నష్టాన్ని కలిగించింది. "ఆంధ్రప్రదేశ్" పత్రిక ఈ విషాద సంఘటనపట్ల ప్రగాఢ సంతాపం వ్యక్తం చేస్తోంది.

—ఎడిటర్

---


సంపుటి: 22 ; సంచిక: 1

ప్రచురణ :
ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ
సమాచార, పౌర సంబంధశాఖ,
హైదరాబాదు.

ముద్రణ :
ఆంధ్ర ప్రదేశ్
ప్రభుత్వ కేంద్ర ముద్రణాలయం,
హైదరాబాదు.

రిజిష్టర్ నెం. హెచ్/హెచ్.డి. 81


కోస్తాలో యీ నెల 19న సంభవించిన పెనుతుఫాను ఉప్పెనలవల్ల అయిదు జిల్లాలలో 11.85 లక్షల ఎకరాలలో వరి, పొగాకు, మిర్చి, అరటి, చెరకు పంటలు నాశనమైనట్లు అధికారికంగా ప్రకటించారు. తుఫానువల్ల 71 లక్షల మందికి నష్టం కలిగింది.

రాష్ట్ర ప్రభుత్వం జారీచేసిన ప్రకటనలో తుఫాను, ఉప్పెనలవల్ల రోడ్లు, విద్యుత్ టెలీకమ్యూనికేషన్ పరికరాలు, రైల్వే ఆస్తులు, నీటి పారుదల కాలువలు, మొదలైన ప్రజోపయోగకర సాధనాలకు బాగా నష్టం కలిగినట్లు పేర్కొన్నారు.

తుఫాను బీభత్సంలో 7988 మంది మరణించారని, మరో 3000 మందిదాకా కనబడటంలేదనీ, 2.31 లక్షల పశువులు చనిపోయాయనీ, 45,500 ఇతర జంతువులు మృతి చెందాయని కూడా ఈ అధికార ప్రకటనలో తెలిపారు. 86.650 గుడిసెలు నీళ్ళలో కొట్టుకుపోగా 2.16 లక్షల మంది నిరాశ్రయులయినారు.

తుఫాను ప్రాంతాలలోని 2302 గ్రామాలలో 71లక్షల మంది ఏదో ఒక విధంగా దెబ్బతిన్నారనీ, 2 లక్షల మంది ప్రజలకు కృష్ణా, గుంటూరు, తూర్పుగోదావరి, ప్రకాశం జిల్లాలలోని సహాయ శిబిరాలలో సహాయం చేయటం జరుగుతున్నది. తుఫాను ప్రాంతాలలో ఇంతవరకు 25000 క్వింటాళ్ళ ఆహారం పొట్లాలను పంపించారు. రోజుకు 10 టన్నుల రొట్టెలు యీ ప్రాంతాలకు పంపిస్తున్నారు.

తుఫాను ప్రాంతాలకు, ప్రత్యేక వైద్య దళాలను పంపినట్లు దివి డివిజన్‌లోని 29 గ్రామాలలోనూ 28 గ్రామాలలో కలరా టీకాలు వేసినట్లు ఆ ప్రకటనలో వివరించారు.

---

# తుఫాను బీభత్సం

## *5 జిల్లాలలో 71 లక్షల మంది ప్రజలకు నష్టం*

---

గుంటూరు జిల్లాలో 6 తాలూకాలోని 402 గ్రామాలు, 7 మున్సిపాలిటీలు దెబ్బతిన్నాయని, దెబ్బతిన్న గ్రామాలలో 12 లక్షల జనాభా, పట్టణాల్లో 8 లక్షల జనాభా ఉన్నదని ప్రకటనలో తెలియజేశారు. ఇక్కడ 26 సహాయక బృందాలు సహాయక కార్యక్రమాలు నిర్వహిస్తున్నాయి. మూడు రోజుల్లో టీకాలువేసే కార్యక్రమం పూర్తికావచ్చు.

గుంటూరులో శవాలను తొలగించడం పూర్తయింది కృష్ణాజిల్లాలో ఈ రోజు అయిపోవచ్చు. ఐ.డి.పి.ఎల్. రూ. 3 1/2లక్షలు విలువచేసే కలరా నిరోధక మందులను ఇచ్చింది. రేపల్లె, బాపట్ల, దివి, బందరుల్లో విపరీతంగా దెబ్బతిన్న ప్రాంతాలలో ప్రభుత్వం శిస్తుమాఫీ చేసింది. మిగిలిన ప్రాంతాలలోకూడా నష్టాన్ని అంచనావేసి శిస్తు మాఫీ చేయవలసిందిగా కలెక్టర్లను ఆదేశించారు. తుఫానుకుగురైన వారికి తిరిగి ఇళ్ళు నిర్మించుకోవడానికి హైదరాబాద్‌లోని హిందూస్తాన్ స్టీల్స్ కంపెనీ 20 టన్నుల జింకు షీట్లను ఇచ్చింది.

—(26-11-1977)

---

## తుఫాను బీభత్సం విశేష సంచిక



# తుఫాను బాధితులను ఆదుకోడానికి ప్రజలు ముందుకు రావాలి

## గవర్నరు సందేశం



ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు శ్రీమతి శారదా ముఖర్జీ తుఫాను బాధితులకు తమ ప్రగాఢ సానుభూతిని తెల్పుతూ ముఖ్యమంత్రి సహాయనిధికి రొక్కం రూపంలోనూ, వస్తురూపంలోనూ విరివిగా విరాళాలు అందజేయాలని స్వచ్ఛంద సంస్థలకు, ధర్మ సంస్థలకు విజ్ఞప్తి చేశారు.

గవర్నరు సందేశం పూర్తి పాఠం:



రాష్ట్రం కోస్తా జిల్లాలలో కనీవినీ ఎరుగని విధంగా పెను తుఫానువల్ల అపారమైన నష్టం జరగడం నాకెంతో విభ్రాంతిని కలిగించి, విచారం కలిగించింది.

గతంలో మూడుసార్లు సంభవించిన తుఫానుల ప్రభావంనుండి యింకా కోలుకోకుండా ఉన్నస్థితిలోనూ మరోవైపు రాష్ట్రం విపరీతమైన అనావృష్టి పరిస్థితులనుండి యిప్పుడిప్పుడే బయటపడుతున్న స్థితిలోనూ ఈప్రకృతి వైపరీత్యం ఏర్పడి తత్ఫలితంగా రాష్ట్ర ఆర్థిక వ్యవస్థకు, ప్రజల నైతిక స్థైర్యానికి పెద్ద విఘాతం ఏర్పడింది

తుఫాను బాధితులకు నా ప్రగాఢ సానుభూతినీ ఈ వైపరీత్యం ఫలితంగా ప్రాణాలు కోల్పోయిన వారి సన్నిహిత కుటుంబ సభ్యులకు నా ప్రగాఢ సంతాపాన్నీ తెలియజేస్తున్నాను.

ఈ విపత్కర పరిస్థితిని ఎదుర్కొనడంలో పరిపాలనా సిబ్బంది సకాలంలో పటిష్ఠమైన చర్యలు తీసుకుని స్వల్పకాలంలోనే సామూహికంగా సహాయం అందజేస్తున్నందుకు నాకెంతో సంతోషంగా ఉంది. బాధిత ప్రజలకు సహాయం చేయడానికి ప్రభుత్వం సకల చర్యలు తీసుకుంటుందని నా విశ్వాసం. అయితే అపారమైన నష్టానికి గురైన బాధితులకు చేయూతనివ్వడానికి ప్రజలుకూడా ముందుకు రావాలి.

తామంతా ముందుకు వచ్చి ముఖ్యమంత్రి సహాయ నిధికి రొక్కం రూపంలోనూ, వస్తురూపంలోనూ విరివిగా విరాళాలు అందజేయాలనీ సాధారణ పౌర జీవితం తిరిగి నెలకొనే విధంగా పునరావాస కార్యక్రమాలలో తోడ్పడాలనీ అందరికీ ముఖ్యంగా స్వచ్ఛంద సంస్థలకు, ధర్మ సంస్థలకు, ఇతర సంస్థలకు నేను విజ్ఞప్తి చేస్తున్నాను.

ఆంధ్రప్రదేశ్ ప్రజలు మొక్కవోని ధైర్యంతో ఈ విపత్కర పరిస్థితిని ఎదుర్కొగలరని ఆశిస్తున్నాను.

# ఈ జాతీయ విపత్తు ధైర్యంతో ఎదుర్కొందాం

## ముఖ్యమంత్రి రేడియో ప్రసంగం

తుఫాను బాధిత ప్రాంతాలలో విమానం ద్వారా పర్యటించి వచ్చిన శ్రీ వెంగళరావు నవంబరు 21వ తేదీ రాత్రి ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుంచి ప్రసంగిస్తూ కోస్తా జిల్లాల్లో శనివారం నాడు సంభవించిన తుఫాను కనీవినీ ఎరుగనిదనీ, దీన్ని ఒక జాతీయ విపత్తుగా పరిగణించాలనీ పేర్కొన్నారు. ఈ సందర్భంగా జరిగిన ప్రాణనష్టం, ఆస్తినష్టం అపారమని ఆయన వెల్లడించారు. ఆపదలో ఉన్న తోటి సోదరులకు విరివిగా విరాళాలు అందజేయ వలసినదని స్వచ్ఛంద సంస్థలు సహాయక చర్యల్లో తోడ్పడాలని ఆయన విజ్ఞప్తి చేశారు.

ముఖ్య మంత్రి ప్రసంగం పూర్తి పాఠం :

"గత శనివారం మన రాష్ట్రం కోస్తా ప్రాంతంలో తుఫానువల్ల జరిగిన అపారమైన జననష్టం, ఆస్తినష్టం మన రాష్ట్రం మున్నెన్నడూ కనీవినీ ఎరుగని ఘోరమైన వైపరీత్యం అనడంలో ఎట్టి సందేహంలేదు. వాస్తవానికి ఇదొక జాతీయ విపత్తుగా భావించవచ్చు. మన రాష్ట్రంలోని కోస్తా జిల్లాలు తుఫాను తాకిడికి గురికావడం వరుసగా మూడు సంవత్సరాలలో ఇది మూడవసారి. 1969లో జరిగిన నష్టం కంటె ఈ తుఫానువల్ల ఏర్పడిన నష్టం ఎన్నోరెట్లు అధికంగా వుంటుందని ఇప్పటివరకు అందిన సమాచారాన్నిబట్టి తెలియవస్తున్నది. ఈ సంవత్సరం మన రాష్ట్రంలో రికార్డుస్థాయిలో ఆహారధాన్యాలు ఉత్పత్తి జరుగుతుందని ఆశిస్తున్న తరుణంలో ఘోరమైనతుఫాను సంభవించి పంటలకు అపారమైన నష్టం జరగడం దురదృష్టకరం. ఈ తుఫానువల్ల ప్రాణాలు కోల్పోయిన వారి సంఖ్య అపారం, ఆస్తినష్టం, ప్రాణనష్టం, పంటలకు జరిగిన నష్టం ఎంత వుంటుందో పూర్తి సమాచారం అందితేగాని తెలియదు. అయినా యీ నష్టం కొన్ని వందల కోట్ల రూపాయలకు చేరుకొని వుంటుందని భావిస్తున్నారు. తుఫానువల్ల జరిగిన నష్టం గురించి తెలియగానే రాష్ట్ర ప్రభుత్వం దెబ్బతిన్న జిల్లాలలో సత్వర సహాయక చర్యలను చేపట్టింది. ఆయా జిల్లాలకు చెందిన మంత్రులు స్వయంగా సహాయక చర్యలను పర్యవేక్షిస్తున్నారు. భారత వైమానికదళ సహాయంతో నీటిమధ్య చిక్కుకొని పోయిన ప్రజలకు ఆహార పదార్థాలను అందించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ తుఫానువల్ల లక్షలాది బీద ప్రజానీకం తలదాచుకొనేందుకు చోటు పోగొట్టుకున్నారు. తుఫానువల్ల ప్రాణాలు కోల్పోయిన వారి సమీప వారసులకు 1000 రూపాయల చొప్పున ఆర్థిక సహాయాన్ని, ఇళ్లు పోగొట్టుకున్న ప్రతి ఒక్కరికీ 200 రూపాయల చొప్పున సహాయాన్ని అందజేయడానికి రాష్ట్రప్రభుత్వం నిశ్చయించింది. ఈ సహాయం వెంటనే అందేటట్లు చూడాలని జిల్లా కలెక్టర్లకు ఉత్తర్వులు జారీ చేశారు. నిరాశ్రయులైన వారికి ఇళ్లు కట్టుకొనే నిమిత్తం అవసరమైన సామాగ్రిని వెంటనే అందజేయాలనీ కలెక్టర్లందరిని ఆదేశించాం.

తుఫానుఫలితంగా కోస్తాజిల్లాలలో పంటలకు, ఆస్తులకు మాత్రమే గాక రవాణా సౌకర్యాలకు, టెలిఫోను, టెలిగ్రాపు సౌకర్యాలకు కూడా గొప్ప నష్టం వాటిల్లింది. దాదాపు రెండు రోజులపాటు యీ జిల్లాలకు, బయటి ప్రపంచానికి పూర్తిగా సంబంధాలు లేకుండా పోయాయి. అనేక చెట్లు కూలటం వల్ల రోడ్ల మీద ఆటంకాలు కలిగి బస్సులు నడవడం అసాధ్యమైంది. గుంటూరు, విజయవాడ, మచిలీపట్టణం, చీరాల, బాపట్ల మొదలైన అనేక ముఖ్యపట్టణాలలో ఇప్పటికీ పల్లపు ప్రాంతాలలో నీరు నిలిచి ఉన్నది. రాష్ట్ర ప్రభుత్వ శాఖలు, కేంద్ర ప్రభుత్వ శాఖలు పౌర జీవనాన్ని తిరిగి మామూలు స్థాయికి చేర్చడానికి కృషి చేస్తున్నాయి.

ఈ తుఫానువల్ల వాటిల్లిన నష్టాన్ని పూడ్చడం ఒక్క ప్రభుత్వం వల్లనే సాధ్యమవుతుందని భావించరాదు. రాష్ట్రంలోని పారిశ్రామికవేత్తలు, వ్యాపారసులు, ధనికులు తమ తమ ప్రాంతాలలో తుఫానువల్ల దెబ్బతిన్న తోటి ప్రజలను ఆదుకోవటానికి భారీ విరాళాలతో ముందుకు వచ్చి సహాయ చర్యల సత్వర అమలుకోసం రాష్ట్రప్రభుత్వానికి చేయూత నివ్వాలి. రాష్ట్రం వెలుపలవున్న వారు కూడా యీ ఘోరమైన ప్రకృతి వైపరీత్యానికి గురైన ప్రజల సహాయానికి ముందుకు రావాలని కోరుతున్నాను. రెడ్ క్రాస్ వంటి స్వచ్ఛంద సంస్థలు యీ తరుణంలో తమకుతామే తుఫాను దెబ్బతగిలిన ప్రాంతాలలో సహాయక చర్యలను ప్రారంభించాలి. రాష్ట్రం ఎదుర్కొంటున్న యీ గడ్డు పరిస్థితుల్లో అన్ని వర్గాల ప్రజలు ముందుకు వచ్చి తుఫానుకు గురైన ప్రజలను ఆదుకోవాలని విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ సహాయక చర్యల్లో పార్టీవిభేదాలు విస్మరించి అన్ని రాజకీయ పక్షాలవారు రాష్ట్రప్రభుత్వ కృషికి తోడ్పడగలరని ఆశిస్తున్నాను. తుఫానువల్ల ఆస్తులు, ప్రాణాలు, కోల్పోయిన రాష్ట్రప్రజలకు నా సానుభూతిని అందజేస్తున్నాను."



# తుఫాను ప్రాంతాల్లో రాష్ట్రపతి పర్యటన

భారత రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి నవంబరు 23వ తేదీన కృష్ణా, గుంటూరు జిల్లాలలో తుఫాను దెబ్బతిన్న ప్రాంతాలను విమానం ద్వారా వీక్షించి గన్నవరం చేరుకున్నారు. రాష్ట్రపతి వెంట గవర్నరు శ్రీమతి శారదా ముఖర్జీ, ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, కేంద్ర వ్యవసాయ మంత్రి శ్రీసుర్జిత్‌సింగు బర్నాలా, రాష్ట్ర వ్యవసాయమంత్రి శ్రీ చొక్కారావు, యితరులు వున్నారు. గన్నవరంవద్ద పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ కృష్ణా, గుంటూరు, తుఫానువల్ల కలిగిన నష్టం తమకు ఎంతో ఖేదాన్ని కలిగించిదని రాష్ట్రపతి అన్నారు. కొన్ని గ్రామాలు పూర్తిగా నేలమట్టం కావడం విమానంలో నుండి చూశామని తెలియజేశారు. అందరికంటే కష్టనష్టాలకు గురైన వారు బీద ప్రజలని అన్నారు. గురువారం నాడు హెలీకాప్టరులో మచిలీపట్నం, రేపల్లె, గుంటూరు, అవనిగడ్డ సందర్శించి ఆయా పట్టాణాలలో ప్రజలను కలుసుకొని వారి స్థితిగతులను స్వయంగా తెలుసుకొనడానికి ప్రయత్నిస్తామని, సాధ్యమైనన్ని లోతట్టు ప్రాంతాలకు వోయి తుఫానువల్ల జరిగిన నష్టాన్ని తెలుసుకుంటామనీ రాష్ట్రపతి అన్నారు. తుఫానులో మరణించిన వారి సంఖ్య దాదాపు 10,000 ఉంటుందనీ, పూర్తి వివరాలు తెలిసిన తర్వాత ఈ సంఖ్య పెరుగవచ్చని అన్నారు. పత్రికలు ప్రాణ నష్టాన్ని గూర్చి ఊహాతీతమైన అంచనాలు వేసి ప్రజల్లో భయాన్ని కలుగజేయరాదని రాష్ట్రపతి విజ్ఞప్తి చేశారు.



## సహాయ కార్యక్రమాలపట్ల రాష్ట్రపతి సంతృప్తి

ఆంధ్రప్రదేశ్‌లో తుఫాను బాధితులకు సహాయ కార్యక్రమాలు ఇప్పుడు చురుకుగా జరుగుతున్నాయని రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి తెలిపారు.

తుఫానుకు గురైన ప్రాంతాలలో పర్యటించి తిరిగిరాగానే శ్రీ రెడ్డి టెలివిజన్ న్యూస్ ఇంటర్వ్యూలో పాల్గొన్నారు.

రాష్ట్ర ప్రభుత్వమైనా, కేంద్రప్రభుత్వమైనా, వైమానికదళమైనా, సైన్యమైనా అంతా ఒకటేనని ఆయన అన్నారు.

తుఫాను ప్రళయం గురించి తెలిసిన వెంటనే రాష్ట్రప్రభుత్వం దిగ్భ్రాంతి చెందిందనీ, రహదారులనిండా అడ్డంకుల వలన, విద్యుచ్ఛక్తి, నీటి సరఫరా లేకపోవటం వలన వెంటనే తగు చర్యలు తీసుకోలేకపోయారని శ్రీ రెడ్డి అన్నారు.

ఇప్పుడు తుఫానుకు గురైన ప్రాంతాలలో అంటువ్యాధులను నిరోధించటం తక్షణ కర్తవ్యమని ఈ విషయంలో విఫలమైతే ఈ సారి చేజేతులా మరొక విపత్తును తెచ్చుకున్నట్టవు తుందని ఆయన అన్నారు.

## ప్రధాని సంతృప్తి

తుఫాన్ దెబ్బకు గురయిన కోస్తా ఆంధ్ర ప్రజలను ఆదుకునేందుకు రాష్ట్రప్రభుత్వం చేస్తున్న కృషిపట్ల ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయ్ సంతృప్తి వ్యక్తంచేశారు. సహాయ కార్యక్రమాలను ఉధృతం చేసిన విషయాన్ని రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి ప్రధానికి తెలిపారు. ప్రధాని శ్రీ మొరార్జీదేశాయి తుఫానుకు గురైన ప్రాంతాలను విమానంనుండి పర్యవేక్షించారు.

# తుఫానుకు గురైన కోస్తా తీరం




REFERENCE

| S.No. | ITEMS | PRAKASAM | GUNTUR | KRISHNA | GODAVARI EAST | GODAVARI WEST | SRIKAKULAM | TOTAL |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | LOSS OF LIFE. | 32 | 1172 | 6706 | 8 | 12 | 2 | 7932 |
| 2. | NO. OF RELIEF CAMPS OPEND | .0 | 72 | 35 | 48 | -- | -- | 172 |
| 3. | NO. OF HUTS AFFECTED. | 12304 | 35938 | 28750 | 6380 | 3278 | -- | 8665[illegible] |
| 4. | NO. OF PERSONS RENDERED HOMELESS | 65000 | 70000 | 75000 | 6380 | -- | -- | 21638[illegible] |
| 5. | LOSS OF CATTLE | 10000 | 100000 | 120000 | 50 | 96 | -- | 23014[illegible] |
| 6. | LOSS OF OTHER LIVE STOCK | 8500 | 16900 | 20130 | -- | -- | -- | 4553[illegible] |

Register No. 83/78 D (Saka era 1883) (A. P. C. S. O 1/4 M) 500

Printed under the Superintendence of Sri Md. Gayasuddin, Asst. Director Survey & Land Records by Lithography at the Andhra Pradesh Central Survey Office Press

# జలప్రళయం

—తిరునగరి

జడధీ! జలధీ, ఎంతపని చేశావు
జనాన్నీ పశుగణాన్నీ, సమస్తాన్నీ హరించావు
మా నివాసాల్ని కూలద్రోశావు
మా ఆధారాల్ని నేలమట్టంచేశావు

నీ హృదయం గంభీరమైందనే తలంచాము
నీ గుండెల్లో మడిగుండాలుంటాయనుకోలేదు
నీవు అల్పిష్టిలా, మత్సరగ్రస్థునిలా
ఈ రేగుతావనుకోలేదు

ఊళ్ళనే నీళ్లగా మార్చి పరవళ్లుతొక్కేస్తావనుకోలేదు
నీ ప్రవాహాల్లో కొట్టుకు వచ్చే శవాల విందారగిస్తావా?
నీ ధాటికాగలేక కూలిన భవనాల్లో బలియైన వాళ్ళ
సజీవసమాధులు పరికిస్తావా?

నోటికందిన పంటనూ
చేతికందిన బిడ్డనూ
పోగొట్టుకున్న వాళ్ళను చూచి
పొగరుబోతులా మిడిసి పడతావా?

ఇంకేం సాధిస్తావు
ఈ ప్రళయం కన్నా?
నీకు గుండెలు లేవా
ఉంటే ఈ తాండవ మేమిటన్నా!

అదిగో అర్ధరాత్రి ప్రియుని కౌగిట్లో ఒదిగి
అట్లే కన్నుమూసిన పడుచు
బిడ్డకు పాలిస్తూ వానిభవిష్యత్తును రంగురంగుల్లో
రాత్రి ఊహించి
ఉదయం చూడనోచుకోని తల్లి
పొలంలో కుక్కి మంచపై కూనిరాగాలు రాత్రంతా తీసి
తెల్లవారే సరికి వరదల్లో దిక్కుతెలియకుండా
కొట్టుకుపోయిన రైతు

గ్రామం న[illegible]బొడ్డున నీళ్ళల్లో తేలియాడే శవం
చర్చిలో సమాధియైన అ[illegible]నం
చెట్ల కొమ్మ పైన [illegible]కారం
గట్లపై కడ ప్రాణం కొట్టుకుంటున్నవారి
హృదయవిదారక దృశ్యం

ఎక్కడికక్కడ కనుమూసిన పశుసంతతి
చిక్కు చీకట్లో ఒకరి నొకరు పలుకరించుకోలేనివా స్థితి

ఈ జలప్రళయం
ఏనాడూ విన్నదీ కన్నదీ కాదు
ఈ అపార నష్టం
ఇప్పటో తీరేదీ కాదు
జడధీ, జలధీ ! ఎంత పని చేశావు
జనాన్నీ, పశుగణాన్నీ, సమస్తాన్నీ హరించావు
అఖిలాంధ్ర ప్రజలారా !
అందరూ రండి
ఆర్త సహోదరులకండగా నిలవండి
మన ధనాన్ని - బలాన్నీ అర్పించి
దుఃఖిత సోదరుల కన్నీళ్ళు తుడవాలి
వారిలో ఆత్మ బలం పెంచి
వాళ్ళనూ—వాళ్ళ గూళ్ళనూ నిలబెట్టాలి

సకల ప్రజలూ ముందుకు రండి
సకలవిధాలా సహకరించండి

కదలండి
కదలిరండి

ఇది మనకు పరీక్ష సమయం
కనీ వినీ ఎరుగనిదీ జలప్రళయం.

# తుఫాను బీభత్సం

## కనీవినీ ఎరగని ఘోర ఉపద్రవం

గత వంద సంవత్సరాలలో కనీవినీ యెరుగని ఘోర ఉపద్రవం గత శనివారం నాడు ఆంధ్ర ప్రదేశ్ కోస్తా జిల్లాలలో సంభవించింది. ఆ రోజు సాయంత్రం కొద్ది గంటల కాలంలోనే తుఫాను విలయ తాండవం చేసి, రాష్ట్రమంతటిలో సౌభాగ్యవంతమైన ఈ జిల్లాలను మరుభూములుగా మార్చివేసింది. మానవుల ప్రాణాలకు, ఆస్తిపాస్తులకు, పంట భూములకు అనూహ్యమైన నష్టాన్ని మిగిల్చిపోయింది. పది నుండి పదిహేను అడుగుల ఎత్తున విజృంభించిన సముద్ర తరంగాలు బంగాళాఖాతాన్ని ఆనుకొనివున్న ప్రదేశాలలోని అనేక గ్రామాలను తుడిచి పెట్టాయి. అన్నిటికంటె ఎక్కువ నష్టం పొందిన కృష్ణా జిల్లా దివి సీమలోని గ్రామాలలో పదివేల మంది నిర్భాగ్య జీవులు తుఫానుకు బలియైపోయారు. తుఫాను బీభత్సానికి గురి అయిన మరొక జిల్లా గుంటూరులో రెండు వేల మంది ప్రాణాలు కోల్పోయారు. మరణించిన పాడిపశువులు గొర్రెలు, ఇతర జంతువులు, కోళ్లు మొదలైన వాటి గురించి పూర్తి సమాచారం యింకా అందకపోయినా, వీటి సంఖ్య వేలలోనే వుంటుందని భావిస్తున్నారు. గుంటూరు జిల్లా రేపల్లె ప్రాంతంలో యిప్పటికీ సంబంధాలు పునరుద్ధరింపబడలేదు. ఆ ప్రాంతంలోని గ్రామాలలో జరిగిన జననష్టం వివరాలు అందిన తరువాత రాష్ట్రంలో తుఫానుకు గురై మరణించినవారి సంఖ్య యింకా పెరిగే అవకాశమున్నది.

కోతలకు సిద్ధంగా వున్న వరి, పత్తి, మిర్చి, యితర పంటలకు సంభవించిన నష్టం వివరాలు యింకా అంచనా వేయవలసి వున్నది. ప్రారంభపు అంచనాల ప్రకారం 15 లక్షల ఎకరాలలో పంటలు నష్టమయ్యాయి. చెరకు, అరటి తోటలు పూర్తిగా నాశనమయ్యాయి. దీనికి తోడు సముద్ర తీరానికి చేరువలో వున్న గ్రామాలలో అనేక వేల ఎకరాల సారవంతమైన భూములపై సముద్రపు కెరటాలు ప్రవహించటంవల్ల యీ భూములన్నీ ఉప్పుతో నిండిపోయి వ్యవసాయానికి పనికిరాకుండా పోవటం జరిగింది. అనేక మంచి నీటి చెరువులు సముద్రపు నీరుతో నిండి త్రాగే నీరు చెడిపోయింది. ఈ విధంగా ఆహారపు కొరతకు త్రాగే నీటి కొరత జతపడింది.

రవాణా సౌకర్యాలకు జరిగిన నష్టం అపారంగా వున్నది. రహదారులు, టెలిగ్రాఫు, టెలిఫోను సౌకర్యాలు, రైలు మార్గాలు బాగా దెబ్బతిన్నాయి. గుంటూరు, విజయవాడ, మచిలీపట్నం వంటి అనేక పెద్ద పట్టణాలలో నీటి సరఫరా, విద్యుత్ సరఫరా, పాల సరఫరా నిలిచి పోయాయి. ఇప్పు



దివి తాలూకా నుండి సాల్ఖనిపేటకు చేరుకున్న ఒక కుటుంబం



దివి తాలూకాలో జలమయమైన ఒక గ్రామంలోని ప్రజలకు హెలికాప్టర్ పైనుండి ఆహారపదార్థాల సరఫరా

డిప్పుడే యీ సౌకర్యాలను పునరుద్ధరించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. విజయవాడ రేడియో కేంద్రం ప్రసార స్థంభాలలో ఒకటి విరిగి పడిపోవటంవల్ల విజయవాడ ఆకాశవాణి కేంద్రం దాదాపు నాలుగు రోజులు ప్రసారాలు నిలిపివేయవలసి వచ్చింది. విజయవాడ వద్ద నెలకొల్పుతున్న థర్మల్ కేంద్రానికి కోటి రూపాయల నష్టం వాటిల్లిందని అంచనా వేశారు. ఆంధ్ర ప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థకు కూడా కోటి రూపాయల నష్టం కలిగినట్లు ఆ సంస్థ జనరల్ మేనేజర్ ప్రకటించారు. కోస్తా జిల్లాలలో విద్యుత్ శాఖ పొందిన నష్టం 5 కోట్ల రూపాయల వరకు వుంటుందని విద్యుచ్ఛక్తి శాఖ మంత్రి ప్రకటించారు.

తుఫాను దెబ్బ తగిలిన జిల్లాలలో వేలాది గృహాలు నేల మట్టమై లక్షలాది ప్రజలు నిరాశ్రయులయ్యారు. వీరిలో అధిక సంఖ్యాకులు బీద ప్రజలు. స్థానిక అధికారులు వీరికి పాఠశాలలు, కళాశాలలు, యితర ప్రభుత్వ భవనాలలో తాత్కాలిక వసతి కలుగజేసి ఆహారాన్ని అందిస్తున్నారు. గుడిసెలలో నివసించే బీద ప్రజలు తమ కొద్ది ఆస్తి పాస్తులను పోగొట్టుకున్నారు. ఇళ్ళు కోల్పోయినవారందరికీ తిరిగి తాత్కాలిక వసతి కల్పించుకొనేందుకు తలా 150 రూపాయలను రాష్ట్ర ప్రభుత్వం అందజేస్తున్నది. వీరికి వెదురు, తాళ్ళు,



ప్రికాళంజిల్లా జొండ్రపేటలో ఇళ్లు, చెట్లు నేలమట్ట మయ్యాయి.



తల్లిదండ్రులను పోగొట్టుకున్న రైతుబిడ్డ.

గడ్డి వంటి గృహ నిర్మాణ వస్తువులను అందజేయాలని జిల్లా కలెక్టర్లకు ఉత్తర్వులు జారీ చేశారు.

కృష్ణా, గుంటూరు జిల్లాలలోని అనేక గ్రామాలు యింకా నీటి మధ్య చిక్కుకొని వున్నాయి. భారత వైమానిక దళం హెలీకాప్టర్ల ద్వారా యీ గ్రామాలలోని ప్రజలకు ఆహారాన్ని, వస్త్రాలను జారవిడుస్తున్నారు. కేర్ (CARE) అనే అమెరికా సంస్థ రొట్టెలను, వస్త్రాలను, హైదరాబాదులోని ఒక ప్రైవేటు సంస్థ బిస్కట్లను విరాళంగా అందజేశాయి. ఆంధ్ర ప్రదేశ్ పాడి పరిశ్రమ అభివృద్ధి సంస్థ కోస్తా జిల్లాలకు పాలను, పాలపొడిని హుటాహుటిన తరలించింది. తుఫాను దెబ్బ తగిలిన ప్రాంతాలలో మృత దేహాలు, జంతువుల కళేబరాలు అధిక సంఖ్యలో పడివుండటం వల్లను, త్రాగే నీరు కలుషితమైనందు వల్లను కలరా వంటి అంటు వ్యాధులు వ్యాపించే ప్రమాద మున్నది. ఈ ప్రమాదాన్ని ఎదుర్కొనే వుద్దేశ్యంతో యీ



అంతా నాశనమై పోయింది!



రంగనాయకమ్మ పాలెం బాధితులను రక్షిత ప్రాంతాలకు తరలింపు

ప్రాంతాలలోని ప్రజలకు అంటు వ్యాధి నిరోధక టీకాలను వేసే కార్యక్రమం చురుకుగా అమలు చేస్తున్నారు. భారత ఔషధాల సంస్థ కొన్ని లక్షల విలువచేసే మందులను విరాళంగా యిచ్చింది. భారత ప్రభుత్వంకూడా ఔషధాలను, టీకా మందులను, బ్లీచింగ్ పౌడరును రాష్ట్రానికి అందజేసింది.

ముఖ్య మంత్రి విజ్ఞప్తిని పురస్కరించుకొని దేశ, విదేశాలనుండి సహాయం చేస్తామనే వాగ్దానాలు అందుతున్నాయి. అమెరికా అధ్యక్షుడు జిమ్మీ కార్టర్, బ్రిటిషు ప్రధాని కాల్లఘన్, ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యదర్శి వాల్డ్హిం స. యం చేయడానికి వాగ్దానాలు చేసిన వారిలో వున్నారు. అనేక రాష్ట్ర ప్రభుత్వాలు ధన సహాయాన్ని అందజేశాయి. కేంద్రప్రభుత్వం యిప్పటికే ఐదు కోట్ల రూపాయల సహాయం అందజేసింది. అదనపు సహాయం త్వరలో అందజేస్తుంది.

భారత రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి నవంబరు 23, 24 తేదీలలో విమానంద్వారా తుఫాను దెబ్బతిన్న ప్రాంతాలను సందర్శించారు స్థానిక ప్రజలతోను, నాయకులతోను సంప్రదించి ప్రజలకు తమ సానుభూతిని తెలియజేశారు. కేంద్ర రక్షణశాఖ మంత్రి శ్రీ జగ్‌జీవన్‌రాం నాయకత్వాన ఒక కేంద్ర బృందం రాష్ట్రానికి వచ్చి తుఫానువల్ల జరిగిన నష్టాన్ని అంచనా వేసింది.

అనేక రాష్ట్ర రాజధానుల నుండి వైద్యుల బృందాలు తుఫాను బాధిత ప్రాంతాలకు వచ్చాయి. రాష్ట్రప్రభుత్వం సైనిక దళాలు, పోలీసుల సహాయంతో సహాయక చర్యలను ముమ్మరంగా అమలు చేస్తున్నది. అనేక స్వచ్ఛంద సంస్థలు ఆయా ప్రాంతాలలో సహాయక శిబిరాలను నిర్వహిస్తున్నాయి.



కావలి ట్రంక్ రోడ్డు విధ్వంసమైంది.



రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి తుఫాను బాధిత ప్రజానీకానికి ధైర్యం చెబుతూన్న దృశ్యం



పారిశ్రామిక యూనిట్ రూపురేఖ లేకుండా పోయింది





కోస్తా తీరంలో తుఫాను బీభత్సం

కొన్ని దృశ్యాలు









వేలాది తుఫాను బాధితులను ఆదుకోవడానికి రాష్ట్ర ప్రభుత్వ యంత్రాంగం అహోరాత్రాలూ కృషి చేస్తున్నది.

కృష్ణా, గుంటూరు జిల్లాల్లో తుఫాను బాధితులకోసం అనేక రక్షణ శిబిరాలు యేర్పాటు చేశారు.

తుఫాను బాధితులకు పాల సరఫరా

మచిలీపట్నం హిందూ కళాశాలలో శరణార్థుల రక్షణ శిబిరం









తుఫాను బీభత్సం
(కొన్ని దృశ్యాలు)







# 113 సంవత్సరాల క్రితం...

—శ్రీ కె. ఆర్. కె. మోహన్

అది 1864 వ సంవత్సరం నవంబరు నెల పదవరోజు. ఆ రోజు దీపావళి ప్రొద్దుటినుంచీ సన్నని చినుకు ప్రారంభమైంది. కాని సాయంత్రానికి తెరిపిఇచ్చింది. కాని మబ్బులు మాత్రం దట్టంగానే ఉన్నాయి ఈదురుగాలి బాగా కొట్టూంది అయినా మచిలీపట్నం లోని ప్రజలు ఎంతో ఉత్సాహంతో బాణాస వా కాల్చి పండుగ జరుపు తున్నారు ఆ రోజుల్లో మచిలీపట్నంలో ఇంగ్లీషు వారి కోట ఉండేది. ఎన్నో వందలమంది ఆంగ్లేయులు అనేకమంది ఆంగ్లేయ అధికారులూ ఉండేవారు. వాళ్ళు ఊళ్ళు సంగరించి పండుగ వేడు కలు చూసి తిరిగికోటకి వెళ్ళారు

పండుగ ప్రశాంతంగా గడిచిపోయింది చలిగాలికి ఒళ్ళు వణుకుతుంటే, దుప్పట్లు, కంబళ్ళు కప్పుకుని ఆదమరచి నిద్రపోయింది ప్రజానీకం సముద్రపు హోరు ఒకటే ఆ నిశీధిని భగ్నం చేస్తుంది. రాత్రిగడుస్తుంటే గాలీ, వానా ఉధృతం అయ్యాయి. ఉన్నట్లుండి పెద్ద శబ్దం చేస్తూ సముద్రం వైపునుంచి ఏదో రాసాగింది. అది ఏమిటో తెలుసు కోవాలనుకొన్నా కారు చీకటిలో ఏమీ కనుపించలేదు. మరు నిమిషంలో వారే కనిపించలేదు. నలభై అడుగుల ఎత్తున ఉప్పెన కెరటం వచ్చి ఊరంతటినీ ముంచెత్తింది. ఆ ఒక్కకాళ రాత్రిలో ముప్పయి వేల మంది మృతి చెందారు

1864 లో బందరుకి వచ్చిన ఈ ఉప్పెన అతితీవ్రమైంది బహుభయంకరమైనది. సముద్రం నీరు తీరందాటి ఇరవై మైళ్ళ లోపలివరకు వ్యాపించింది అది పూర్తిగా తియ్యడానికి కొన్ని వారాలుపట్టింది. అది ప్రవహించిన పేరకినేల అంతా చవటి మట్టిగా మారిపోయింది. బావులన్నీ ఉప్పునీటితో నిండిపోయాయి ఈ ఉప్పెనలో బందరులో పంతులుగారి మేడ ఒక్కటిమాత్రం పూర్తిగా మునగకుండా ఉందట దానిమీద ఎక్కినవాళ్ళు కొందరు తప్ప అందరూ మరణించారు. అనేకమంది ఆంగ్లేయులు చనిపోయారు. ఒక ఆంగ్లేయ అధికారి భార్యంటికి కొట్టుకుపోయి ఆమె పొడవైన జుట్టు ఒక చెట్టుకొమ్మకి చుట్టుకుపోయింది ఆ జుట్టుని కత్తిరించి కాని ఆమె దేహాన్ని బయటకి తీయలేకపోయారు.

1864 ఉప్పెనకి ముఖ్యకారణం సముద్రం అడుగున భూమి పేలడం ఆ రాత్రి సముద్రంమీద పెద్దపెద్దమంటలు కనిపించా యట. సముద్రంమీద ప్రయాణం చేస్తున్న ఒక ఓడ, కెరటంలో కొట్టుకొని వచ్చి, నోబుల్ కాలేజి కాంపౌండ్‌లో, తాటిచెట్ల మధ్య చిక్కుకుపోయింది.



1864 వ సంవత్సరంలో వచ్చిన పెను తుపానులో మృత్యు వాతబడ ముప్పైవేల మంది ప్రజల స్మారకార్థం బందరు కోటలో నిర్మించిన స్మారక చిహ్నం

18వ శతాబ్దంలో కూడా ఒకపెద్ద ఉప్పెన బందరుని ముంచి ఇరవై వేలకి పైగా మృతి చెందారని తెలుస్తూంది. కాని దీని వివ రాలు పూర్తిగా తెలియవు 1864 ఉప్పెన తర్వాత మాత్రం బందరు ప్రాంతం వారికి నవంబరు నెలఅంటేనే నవనాడులూ కృంగిపో తాయి. అప్పటినుంచీ ప్రతి నవంబర్‌లో, చిన్నదో పెద్దదో తుఫాను వస్తూనే ఉంటుంది. కనీసం గాలివాన అయినా వస్తుంది. క్రిందటి తుఫాను, ఈసారి తుఫాను, ఉప్పెనకూడా నవంబరులోనే వచ్చాయి.

1864 ఉప్పెనలో మరణించినవారి స్మృతికి ఆంగ్లేయులు మచిలీపట్నం మధ్యలో ఒకస్మారక స్తంభాన్ని, బందరుకోట దగ్గర మరొక స్మారక చిహ్నాన్ని కట్టారు.

1864 ఉప్పెనలో బందరులోని ఇళ్ళన్నీ సర్వనాశనం అయ్యాయి ఇంగ్లీషువారి కోటగోడ ఒకభాగం, ఒక చర్చిలోని స్తంభం నుసిహోగా మొత్తం నేలమట్టం అయింది. అంతటితో, ఉప్పెనలతో సతమతమయ్యే ఈ నగరాన్ని వదిలి ఆంగ్లేయులు తమ కోటని పూర్తిగా మద్రాసుకు మార్చేశారు. అంతటితో మచిలీ పట్నం తనశోభని, ప్రాముఖ్యాన్ని కోల్పోయింది ఈ ఉప్పెన రాకుండా ఉండి ఉంటే, మచిలీపట్నం మద్రాసుతో సమానంగా ఎదిగి ఉండేది

---

ముఖ్యమంత్రి సహాయ నిధికి ఉదారంగా విరాళాలివ్వండి

---



బందరు రేవులో బీభత్సం

బందరు కోటవద్ద రోడ్డు జలమయమైంది.









## కోస్తా రైతుల కొంపకూల్చిన

1. పొన్నూరులో చెట్లు కూలిన దృశ్యం
2. బాపట్లలో ధాన్యం బస్తాలు జలమయం
3. గుంటూరులో నీటిలో మునిగిపోయిన పొగాకు బేళ్లు
4. గుంటూరులో నేలమట్టమైన పొగాకు గిడంగి
5. చింతలపూడిలో ధ్వంసమైన తమలపాకు తోటలు











## పెను తుఫాను దృశ్యాలు

6. చేబ్రోలులో నీట మునిగిన వరిపొలాలు
7. గుంటూరులో ఇందిరానగర్ జలమయమైన దృశ్యం
8. చెల్లాచెదరైన బాపట్ల రైల్వే స్టేషన్
9. భట్టిప్రోలులో పడిపోయిన సాపు బోర్డు మిల్లు
10. గుంటూరు మార్కెట్ యార్డులో నీట మునిగిన మిర్చిబేళ్లు







# వివిధ పత్రికల అభిప్రాయాలు

(తుఫాను సృష్టించిన బీభత్సంపై వివిధ పత్రికలు తమ సంపాదకీయాల్లో వెలిబుచ్చిన అభిప్రాయాలు ఈ దిగువ ప్రచురిస్తున్నాం.)

ఆంధ్రదేశం ప్రకృతి ఆగ్రహానికి గురిఅయింది. గోదావరి, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాల ప్రజలు భయంకరమయిన తుఫాను దెబ్బకి గురిఅయ్యారు కృష్ణా, గుంటూరు జిల్లాలు మరీ నష్టపడిపోయాయి. తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌లకి రెండింటికీ భారీ సహాయం కావాలి. మొదటి నుంచీ ఆంధ్రులు దేశంలో ఎవరికి నష్టంవచ్చినా వారి సహాయంకోసం ప్రయత్నాలకి వెనుదియ్యని వారుగా పేరు పొందారు.

ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు విరాళాలకోసం విజ్ఞప్తిచేశారు. ఇంతలో ఏన్నో సహాయ చర్యలని మొదలు పెట్టారు. గాలివాన బీభత్సం అధికంగా ఉండిన చోటులలో విద్యుచ్ఛక్తి, రవాణా సౌకర్యాలు దెబ్బతిన్నాయి. ముందు వాటిని పునరుద్ధరించాలి. అంటు వ్యాధులు చెలరేగకుండా జాగ్రత్తలు తీసుకొనడం కూడా చాలా అవసరం. పెద్ద ఎత్తున ఆహారం అందుబాట్లు జరగటమూ అవసరమే. ప్రసార సౌకర్యాలు సక్రమంగా పనిచేసినప్పుడే ఇతర ఆధునిక సౌకర్యాలు పనికిరాగలవు. వీటిని అతి త్వరలో కనీసం మామూలుస్థాయికి తీసుకురావాలి. తుఫాను బీభత్సానికి గురి అయినవారందరూ వీలయినంత శీఘ్రంగా తమ మామూలుదైనందిన జీవన విధానాలని కొనసాగించటం ప్రారంభించగలరని అందరూ ఆశిస్తున్నారు.

—(ఆంధ్ర పత్రిక)

మిన్ను విరిగి మీద పడింది. మున్నెన్నడూకనీ విననంత ప్రళయం వచ్చి పడింది. పెనుతుఫాను విలయతాండవంచేసింది. ఒకే ఒక్క రోజులో కోస్తా ఆంధ్ర జిల్లాలు అల్లకల్లోలమైనాయి. ఆకస్మికంగా వచ్చిపడిన ఈ మహా విపత్తునుంచి ఎప్పటికి తేరుకొంటామో తెలియదు. విభ్రాంతి నుంచి తెప్పరిల్లి తేరిపారచూస్తేనే గాని జరిగిన నష్టం అంతు చిక్కదు.

ఎక్కడ చూసినా గాలీ వానా సృష్టించిన విధ్వంసకాండ దృశ్యాలు హృదయ విదారకంగా కనిపిస్తున్నాయని వార్తలు అందాయి. అందిన వార్తల మేరకే నష్టాలు పరితాపం కలిగిస్తున్నాయి. నేలమట్టమైన పేదల నివాసాలు, కూకటి వేళ్ళతో కూలిపోయిన మహా వృక్షాలు, కప్పులు ఎగిరిపోయి మొండి గోడలతో నిలిచిన ఇళ్ళు, ప్రచండ వేగంతో వీచిన గాడ్పులకు మెలికలు తిరిగి, వంగిపోయాయి. అదేమి శాపమోగాని ఎనిమిది తొమ్మిది సంవత్సరాలుగా తుఫానులు ఆంధ్ర తీరాన్ని దెబ్బమీద దెబ్బ తీస్తున్నాయి. ఒక యేడాది పంట పోతే రైతు నడుం విరిగి కనీసం మూడు నాలుగేళ్ళకు గాని కోలుకోలేడు. నిరుడుమట్టుకు నిరుడు గాలివానకు పైర్లు దెబ్బతిన్న రైతు పంట వేయక చెడటంకంటె వేసిచెడడం మేలని అప్పోసప్పో తెచ్చి వ్యవసాయం చేస్తే ఇప్పుడు మళ్ళీ ఇంత విపత్తువచ్చిపడింది. ప్రకృతి వైపరీత్యాలకు ఎవరు చేయగలిగిందీ ఏమీ లేదు. ఇంతవరకు అభివృద్ధి చెందిన విజ్ఞాన శాస్త్రం రానున్న ప్రమాదాన్ని సూచించడానికి మట్టుకే తోడ్పడుతున్నది.

యావద్దేశానికీ తిండిపెట్టే తెలుగునాడు తిరిపెమెత్తదు. సాధ్యమైనంతవరకుస్వశక్తిపై ఆధారపడటానికే ఎప్పుడూ ప్రయత్నిస్తుంది. ఇప్పుడూ అంతే. ఐతే, మన రాజ్యాంగ వ్యవస్థలో కేంద్ర ప్రభుత్వానికి ఒక నైతిక బాధ్యత ఉంది. ఏరాష్ట్రానికైనా ఆపద వాటిల్లితే ఆదుకోవలసిన కర్తవ్యం ఉంది. తమిళనాడులో కానీండి, తెలుగునాడులో కానీండి కడచిన పది పది హేను రోజుల కాలంలో సంభవించిన ప్రకృతి వైపరీత్యాలు యావద్దేశాన్ని నష్టపరుస్తున్నాయి. ఇది గుర్తించవలసింది కేంద్ర ప్రభుత్వం. సహాయాన్ని స్వీకరించవలసింది రాష్ట్ర ప్రభుత్వం.

(ఆంధ్రప్రభ)

అది ప్రళయ రాత్రి. నింగి, నేల ఏకమై శోకించిన రాత్రి.

ఝంఝూనిలం జగద్భయంకరంగా గర్జిస్తూ విలయతాండవం చేసినరాత్రి.

ఆకాశం వికటాట్టహాసం చేసిన రాత్రి.

లక్షలాది ప్రజల హృదయ కుహరాలలో ఆశాజ్యోతిని ఆర్పివేయడానికి భయాల చీకట్లగుంపులు కుట్రచేసి గుసగుసలాడిన రాత్రి.

వృద్ధులను, యువకులను ఎవరినీ వదలి పెట్టలేదు. వేలాది ప్రజలను తన కరాళ దంష్ట్రలమధ్య కసితీరా నమిలి కబళించింది.

ఇక పంటలో: దేశానికి ఆంధ్రప్రదేశ్ అన్నపూర్ణ. ఆంధ్రప్రదేశ్‌కు కోస్తా జిల్లాల ప్రాంతం ధాన్యాగారం. ఈ ఏడాది ఈ ధాన్యాగారం బంగారంగా మారిపోతుందని రైతులు ఆశపడ్డారు. ఈ నాలుగు జిల్లాలలో ఎటు చూచినా కోత కోసిన పొలాలు, కోత కోయని పొలాలు, పచ్చని తివాచీవలె లక్షలాది ఎకరాలలో పరుచుకున్న పొలాలు, నవ్వుతున్న పొలాలు, నిండు చూలాలివలె సగర్వంగా తలఎత్తి నిలబడిన పొలాలు: ఆకొన్న నోటివద్ద సిద్ధాన్నం వలె కలకల లాడిన పొలాలు, ఏ షరాబూ ఖరీదు కట్టలేని పొలాలు—అన్నిటినీ వాయువు, వరుణుడు కలిసి పొట్టన పెట్టుకున్నారు.

అయినా, శిశిరం తర్వాత వసంతం. చీకటి తర్వాత వేకువ నిరాశ తర్వాత ఆశ.

మోడైన మ్రానులను చిగురింప జేయడానికి వసంతాన్ని తీసుకురావాలి. నిరాశా తమస్సులను తరిమివేయడానికి ఆశాజ్యోతులను వెలిగించాలి.

ఇది మనలో అదృష్ట వంతులైనవారందరి బాధ్యత రాష్ట్ర ప్రభుత్వం బాధ్యత, కేంద్ర ప్రభుత్వం బాధ్యత.

కష్టాలకు, నష్టాలకు లోనై, సమస్తాన్నీ కోల్పోయిన వారి కన్నీటిని తుడవడానికి అందరూ కదలిరావాలి ఇదే ఇవాళ మేము బరువెక్కిన గుండెతో మా పాఠకులకు విన్నవించ గలిగింది.

—ఆంధ్రజ్యోతి

## పగబట్టిన ప్రకృతి !

అదేమి వైపరీత్యమో కాని, గత మూడు సంవత్సరాలుగా ఆంధ్ర కోస్తా ప్రాంతంపై ప్రకృతి పగబట్టినట్లుంది పంటసిరి రైతు ఒడిలో వాలే సమయాన్ని ఎంచుకొనే ఈ దాడి జరుగుతూందా అనిపిస్తుంది పచ్చపచ్చగా పెరిగి పండి వొరిగున్న పంటపొలాలపై పళ్ళ తోటలపైన ప్రచండ ఝంఝూ ప్రభంజనం విజృంభించి వర్ణనాతీతమైన విధ్వంసవిహారం చేస్తుంది ఈ సారి విరుచుకు పడిన తుఫాన్ పైశాచిక విలయతాండవం లాంటిది గతంలో యెన్నడూ జరుగలేదని అంటున్నారు

మూడేండ్లుగా వరుసగా బొట్టుపెట్టి పిలిచినట్టుగా దాపురిస్తున్న సర్వ వినాశకర ప్రాకృతిక విజృంభణను కనిపెట్టి అరికట్టగల మార్గాలు లేవా !

అన్నపూర్ణగా పేరుగాంచిన కోస్తా ప్రాంతంలో తుఫాన్ వల్ల యెంత నష్టం జరిగిందో అంచనావేయడం అసాధ్యంగావుంది. ప్రాంతమంతా పూర్తిగా అస్తవ్యస్తమై పోయింది లక్షల ఎకరాల పంట మూనగాచి నక్కలపాలైంది.

రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు యీ ఘోర వైపరీత్యాన్ని గురించి తమ ఆవేదనను ప్రకటిస్తూ, బాధితులకు ప్రభుత్వం తక్షణ సహాయం చేస్తుందని ప్రకటించారు. యావత్ దేశ ప్రజానీకాన్ని ఆంధ్రప్రజలను ఆదుకొమ్మని అర్థించారు.

కోస్తా ప్రాంతంలో వికటతాండవం చేసిన తుఫాన్ వల్ల జరిగిన నష్టం అపారమైంది అంతేకాదు అసంఖ్యాకమైన యితర సమస్యలు యిందులో నుంచి వుత్పన్నమవుతాయి అనేకరకాల అంటు రోగాలు వ్యాపిస్తాయి ప్రజల యిబ్బందులను విందుగా వుపయోగించుకొనే స్వార్థశక్తులు తలయెత్తుతాయి కొంపా గోడూ పోగొట్టుకున్న నిరాశ్రయులు వేల సంఖ్యలో వుంటారు ఈ సమస్యలన్నిటినీ ప్రభుత్వం ఒక్కటే పరిష్కరించజాలదు కాబట్టి వివిధవర్గాల ప్రజలు బాధితులకు వుదారంగా సహాయపడడం తమ కర్తవ్యంగా ఎంచాలి కేంద్ర ప్రభుత్వం యీ నష్టాన్ని పూడ్చడంతో తన వంతు బాధ్యతను నిర్వహిస్తుందని ఆశిస్తున్నాము

—ఈనాడు

## ఘోర విపత్తు

ఆంధ్రప్రదేశ్ కు ఇటీవలి చరిత్రలో ఎన్నడూ లేనంత ఘోరవిపత్తు సంభవించింది 19వ తేదీ సాయంత్రం 3–15 గంటలకు ఆంధ్ర కోస్తా మీద వందమైళ్ళ వేగంతో 40 మైళ్ల నిడివిన భయంకరమైన తుఫాను విరుచుకుపడింది సముద్రపు అలలు తీర ప్రాంత గ్రామాలను ఎన్నిటినో ముంచివేశాయి గుంటూరు, తెనాలి, చీరాల, బాపట్ల, విజయవాడ మున్నగు అనేక పట్టణాలు, వందల కొలది గ్రామాలు మాటలలో వర్ణించడానికి వీలులేనంత ప్రళయతాండవానికి గురి అయ్యాయి

అర్థశతాబ్ది కాలంలో ఆంధ్రప్రదేశ్ ప్రజలు ఇంతటి ప్రళయం ఎరుగరు బందరు ఉప్పెన 1864లో వచ్చింది మళ్ళీ దాదాపు వంద సంవత్సరాలకు అంతటి ఘోర విపత్తును ఇది మించి ఉందని అంటున్నారు

—విశాలాంధ్ర



రిలీఫ శిబిరాల్లో ఆహార పదార్థాలు సేకరించి పంపిణీ చేశారు.

# తక్షణ చర్యలు

## ట్యాంకర్ల ద్వారా నీటి సప్లయి ఏర్పాటు

కృష్ణా జిల్లాలో తుఫాను బాధితులకు మంచినీటి సరఫరా నిమిత్తం రాష్ట్ర పాడి పరిశ్రమాభివృద్ధి సంస్థ 7 వేల లీటర్లు నిల్వచేసే స్తోమతుగల రెండు ట్యాంకర్లను ఇచ్చింది. గుంటూరు జిల్లాకు కూడా మరో ట్యాంకర్‌ను యిచ్చారు.

కృష్ణా, గుంటూరు జిల్లాల్లో తుఫాన్ బాధితులకు పాలు, పెరుగు, ఉచితంగా పంపిణీ చేయబడింది.

చేనేత సహకార సంఘాలు, వస్త్ర వ్యాపారులు ప్రజలనుండి వస్త్రాలు, దుస్తులు, పాత బట్టలు కూడా సేకరించి, తుఫాన్ బాధితులకు అందజేయడానికి కార్యక్రమం తయారుచేసినట్లు చేనేత శాఖ మంత్రి శ్రీ కె. వి. కేశవులు విలేఖరులకు చెప్పారు.

వస్త్రాల సేకరణ కార్యక్రమం చేనేత మగ్గాల శాఖ అసిస్టెంటు డైరెక్టర్‌లకు అప్పగించారు. పాత బట్టలను యిచ్చేవారు 'ఆప్కో' ఎంపోరియంలో అందజేయవచ్చనీ, వీటన్నిటినీ అనంతరం ఆయా జిల్లాల కలెక్టర్‌లకు అందజేయనున్నట్లు శ్రీ కేశవులు చెప్పారు.

## తుఫాను బాధితులకు ఆర్థిక సహాయం

రాష్ట్ర ప్రధాన ఎన్నికల అధికారి శ్రీ దిల్ సుఖ్‌రామ్, ఏలూరు పట్టణంలో తుఫాను దెబ్బతిన్న ప్రాంతాలను పర్యటించి 379 మంది తుఫాను బాధితులకు రూ. 22,060 ఆర్థిక సహాయాన్ని అందజేశారు. వట్లూరు, గ్రామంలో గుడిసె కూలిపోవటంవల్ల మరణించిన శ్రీమతి షేక్ మీరాబీ నలుగురు మైనర్ పిల్లలకు రూ. 2,000 కూడా పంచిపెట్టారు. ఈ మొత్తాన్ని ఫిక్సెడ్ డిపాజిట్‌లో జమచేయవలసినదే ఈ నలుగురు పిల్లలను సాంఘిక సంక్షేమ వసతి గృహంలో చేర్చుకొని విద్య చెప్పించాలని తహశీల్దార్‌కు సూచనలు చేశారు.

నవంబరు 19, 20 తేదీలలో నెల్లూరు, బిట్రగుంట, గూడూరు రైల్వే స్టేషన్లలో ఆగిపోయిన రైల్వే ప్రయాణీకులకు ఆహారం, మందుల సరఫరాలను నెల్లూరు జిల్లా కలెక్టరు శ్రీ సి. అర్జున్‌రావు ఏర్పాటు చేశారు. కోస్తా జిల్లాలలో పెనుతఫానుల కారణంగా నెల్లూరులో 400 మంది మద్రాసు-ఢిల్లీ లింక్ ఎక్స్‌ప్రెస్ ప్రయాణీకులు, బిట్రగుంటలో పూరి ఎక్స్‌ప్రెస్, మద్రాసు-హౌరా ఎక్స్‌ప్రెస్‌కు చెందిన 800 మంది ప్రయాణీకులు, గూడూరు స్టేషన్‌లో తిరుమల ఎక్స్‌ప్రెస్‌కు చెందిన 100 మంది ప్రయాణీకులు ఆగిపోయారు.

ఈ రైల్వే స్టేషన్లనుండి విజయవాడకు వెళ్ళదలచిన ప్రయాణీకులకు ప్రత్యేక ఆర్. టి. సి. బస్సులను ఏర్పాటు చేశారు. జిల్లా రెవెన్యూ అధికారి శ్రీ వి ఎస్ సంపత్ రెవెన్యూ డివిజినల్ అధికారి శ్రీ డబ్ల్యు. సత్యనారాయణ, ఆర్. టి.సి. జిల్లా మేనేజరు శ్రీ వెంకటేశ్ ప్రభృతులు ఆహారం రవాణా ఏర్పాట్లను పర్యవేక్షించారు. ఆగిపోయిన ప్రయాణీకులకు ఎంతో ఊరట కలిగిస్తూ రైళ్లు కదిలాయి.

## ఏలూరు పట్టణంలో పల్లపు ప్రాంతాలలో జిల్లా అధికార్ల తనిఖీ

ఏలూరు పురపాలక సంఘ ప్రాంతంలోనూ, పరిసర ప్రదేశాలలోనూ ఉన్న పల్లపు ప్రాంతాలు, కార్మికులు నివసించే ప్రాంతాలలో శనివారం తుఫానువల్ల జరిగిన నష్టాన్ని అంచనా వేయడానికి జిల్లా కలెక్టర్, జిల్లా రెవెన్యూ అధికారి, పోలీస్ సూపరింటెండెంట్, తహశీల్దారు ఈ ప్రాంతాలను తనిఖీ చేశారు. నవంబరు 20 వ తేదీన తీవ్రమైన పెనుగాలులలో 123 మిల్లీమీటర్ల వర్షం ఏలూరు పట్టణంలో పడింది.



తుఫాను బాధితులకు అన్నదానం

# తుఫాను నష్టాలు

ఏ రోజు కారోజు తుఫాను నష్టాలను గురించి జిల్లా కలెక్టర్లనుండి ప్రభుత్వానికి నివేదికలు అందాయి. వాటిలో ప్రధాన భాగాలు :

## కోస్తాజిల్లాలలో తుఫానువల్ల సంభవించిన నష్టం

నెల్లూరు : నెల్లూరు జిల్లాలో తుఫాను బీభత్సం ఏర్పడనప్పటికీ రైల్వే, టెలికమ్యూనికేషన్లకు అంతరాయం కలగటంవల్ల రైళ్ళ రాకపోకలు వివిధ స్టేషన్లలో ఈ దిగువ తెలిపిన విధంగా నిలిచిపోయాయి.

బిట్రగుంట స్టేషన్‌లో రెండు రైళ్లు, గూడూరు స్టేషన్‌లో రెండు రైళ్లు, నెల్లూరు స్టేషన్‌లో ఒక రైలు.

మద్రాసు—హైదరాబాదు ఎక్స్‌ప్రెస్ సూళ్ళూరుపేట సమీపించి వెనుదిరిగి పోయింది. సూళ్ళూరుపేటలో నిలిచిపోయిన ప్రయాణీకులకు ఆహార పదార్థాలను, నీటిని సరఫరా చేసేందుకు కలెక్టరు తక్షణ చర్యలను ఏర్పాటు చేశారు. కావలి వాగు పొంగి వరద వచ్చిన దృశ్యాన్ని చూసేందుకు వెళ్ళిన ఒక వ్యక్తి వెంకటగిరి వద్ద మరణించాడు.

ఒంగోలు : నవంబరు 19 రాత్రి 9.00 గంటల వరకు, ఉదయం నుండీ కందుకూరు, ఒంగోలు, చీరాల తాలూకాల్లో గాలి ఉధృతంగా కొనసాగింది. ఎన్నో చెట్లు నేలకూలాయి. మధ్యాహ్నం వర్షం విజృంభించింది. టెలికమ్యూనికేషన్ సౌకర్యాలకు అంతరాయం కలిగింది. బస్సులు నిలిచిపోయాయి. ప్రాణనష్టంగానీ, ఆస్తులకు నష్టంగానీ వాటిల్లినట్లు వార్తలు తెలియ రాలేదు. వరి, పొగాకు పంటలకు నష్టం వస్తుందని అంచనా.

గుంటూరు : తుఫాను గాలీ వానాతో నెమ్మదిగా ప్రారంభమై మధ్యాహ్నం నుండి పెరుగుతూవచ్చి సాయంత్రానికి ఉధృతంగా సాగుతూ రాత్రి 11.00 గంటల వరకు ఎడతెరిపి లేకుండా నష్టపరిచింది. పక్కా భవనాలుకూడా కూలిపోతాయా అన్నట్లుగా తుఫాను గాలులు వీచాయి. అన్ని కమ్యూనికేషన్ సౌకర్యాలకు విద్యుచ్ఛక్తి నిలిచిపోయాయి. ఈ తుఫాను అతి విపరీతమైన పరిణామాలకు దారితీస్తుందనీ, పెద్దయెత్తున రక్షణ, ఉపాధి చర్యలు చేపట్టవలసిన అవసరం ఎంతైనా ఉన్నదనీ కలెక్టరు అభిప్రాయపడుతున్నారు. తీర ప్రాంతంలో గ్రామాలలో నివసించే వారిని రక్షించేందుకు సైనిక సహాయం తీసుకుని, వాటిల్లిన నష్టాన్ని అంచనా వేయాల్సి ఉంటుంది, చెట్లుకూలిపోవటంవల్ల రహదారులు చెడిపోయాయి. గుంటూరు పట్టణంలోకూడా రోడ్లు అంతరాయాలకు గురై దిగువ ప్రాంతాలు వరద నీటిలో మునిగిపోయాయి. రాత్రి ఏ ఒక్కరు ఇండ్లు విడిచి బయటకి రాలేకపోయారు.

శ్రీకాకుళం : సాయంత్రం గాలులు వీచి వానపడినట్లుగానూ, అనేక తాలూకాల్లో 5 నుండి 25 మి. మీ. మేరకు వాన కురిసినట్టుగా కలెక్టరు తెలియజేస్తున్నారు. పంటకుగాని, కమ్యూనికేషన్ సౌకర్యాలకుగాని నష్టం కలిగించలేదు. ఆకాశం మేఘావృతమై ఉంది.

ఒంగోలు : నవంబరు 21 వ తేదీ తెల్లవారుజామున భారీ వర్షం ప్రారంభమై నిరంతరం కొనసాగింది. మొత్తం 24 మంది మరణించారు. దాదాపు 10 వేల ఇల్లు కూలిపోయాయి. మత్స్య పారిశ్రామికులకు, నేత పనివారికి దాదాపు రు. 30 లక్షల నష్టం వాటిల్లింది. మసూరి వరి, మిర్చి, పత్తి పంటలకు భారీనష్టం కలిగినట్లు అంచనా. తీవ్రతర సహాయక చర్యలు తీసుకుంటున్నారు.

కృష్ణా : బందరు పరిసరాలలో 22 మృతదేహాలను ఇంతవరకు కనుగొన్నారు. 150 మంది మరణించారని అంచనా. రంగనాయకంపేట, గాజుపేటలో సహాయక బృందాలు వెళ్ళి అనేక మందిని ఆదుకున్నారు. తుఫానుకు గురిఅయిన మూడు గ్రామాలతో తిరిగి సంబంధాలను ఏర్పరచుకొని ఆహార పదార్థాలను పంపారు.

విపరీతమైన పంటనష్టం, పశునష్టం జరిగినట్లు తెలుసుకున్నారు. బందరు రేవులో లంగరువేసి వున్న 125 మోటారు బోట్లు ప్రవాహంలో సుదూర ప్రాంతాలకు కొట్టుకుపోయి బందరుకు మూడు నాలుగు కిలోమీటర్ల దూరంలో అలల తాకిడికి నేలలో కూరుకుపోయాయి. ప్రస్తుతం నాలుగు మోటారు బోట్లు తుఫాను



శిథిలావశేషాలు

బాధిత గ్రామాలతో సంబంధాలు ఏర్పరచుకోడానికి నిర్వహించబడుతున్నాయి.

పశ్చిమగోదావరి జిల్లాలో 5 గురు వ్యక్తులు మరణించారని జిల్లా కలెక్టర్ తెలియజేస్తున్నారు. ఏలూరు పట్టణానికి నీటి సరఫరాను, పట్టణంలో కొన్ని ప్రాంతాలకు విద్యుత్ సరఫరాను పునరుద్ధరించారు. అంటు వ్యాధులు వ్యాపించకుండా అన్ని నిరోధక చర్యలను అమలు చేస్తున్నారు.

ప్రకాశం జిల్లా ప్రాథమిక అంచనాల ప్రకారం చేనేత కార్మికులకు జరిగిన నష్టం రూ. 60 లక్షల వరకు ఉన్నది. పురపాలక సంఘం భవనాలకు రూ. 7 లక్షల నష్టం జరిగింది. మూడు వేల గొర్రెలు, వెయ్యి పాడి పశువులు మరణించాయి. చీరాల రైల్వే స్టేషనుకు, వై. ఆర్. ఎస్. కళాశాలకు, మహిళా కళాశాలకు, రాష్ట్ర గిడ్డంగుల సంస్థ భవనాలకు, అనేక పారిశ్రామిక సంస్థలకు భారీ నష్టం కలిగింది. అంటు వ్యాధుల నిరోధానికి భారీ యెత్తున్న టీకాలను వేస్తున్నారు.

ఖమ్మం జిల్లా మధిర తాలూకా ఎర్రుపాలెం, వైరా, మధిర, తల్లాడ రెవిన్యూ విభాగాలలో అనేక గ్రామాలు, సత్తుపల్లి తాలూకా కల్లూరు, లంకపల్లి, సత్తుపల్లి, దమ్మపేట, అశ్వారావుపేట రెవిన్యూ విభాగాలలోని గ్రామాలు తుఫానుకు గురైయ్యాయి. 5,000 పూరి గుడిసెలు నేలమట్టమయ్యాయి. అనేక పశువులు, గొర్రెలు నష్టమైనట్లు తెలుస్తున్నది. మధిర తాలూకాలో ముగ్గురు వ్యక్తులు మరణించారు. తుఫానువల్ల దెబ్బతిన్న రోడ్డు, రైలు మార్గాలన్నిటినీ పునరుద్ధరించారు.

గుంటూరు జిల్లాలో 306 మంది వ్యక్తులు మరణించారు. గుంటూరు పట్టణంలోనే మరణించిన వారి సంఖ్య 200 దాకా ఉన్నది. *కురుచేడు నుండి వినుకొండ పోతున్న ఎ.పి.సి. 1627 సంఖ్యగల బస్సు ఐనవోలు పంచాయతీ సమితి ప్రాంతంలో గుండ్లకమ్మ నదిలో కొట్టుకుపోవడంవల్ల నలుగురు వ్యక్తుల జాడ తెలియరావటంలేదు. రేపల్లె, బాపట్ల ప్రాంతాలకు రోడ్ సంబంధాలు యింకా పునరుద్ధరింపబడలేదు.

శ్రీకాకుళం జిల్లా వేగావతి నది వంతెనవద్ద ఏర్పడిన గండిని పూడ్చివేయటం జరిగింది. నవంబరు 21వ తేదీ సాయంత్రం 6-00 గంటలకు సాలూరు పట్టణానికి రాకపోకల సౌకర్యాలు పునరుద్ధరించారు. సాలూరు, సుమ్మగోడ మధ్య ఘాట్ రోడ్‌మీద కొండ చరియలు విరిగి పడడంవల్ల ఏర్పడిన అవరోధాలను తొలగిస్తున్నారు. పాలకొండ వద్ద గోపాలపురం గ్రామంలో ఒక వ్యక్తి మరణించాడు. దేవకివాడ గ్రామంలో నీటిలో చిక్కుకు పోయిన ప్రజలను 22వ తేదీ ఉదయానికి సురక్షిత ప్రదేశాలకు చేర్చారు.

తూర్పుగోదావరి జిల్లా కేంద్ర కార్యాలయానికి అందిన సమాచారం ప్రకారం కాకినాడ తాలూకాలో 136 సెంటీమీటర్లు, పిఠాపురం తాలూకాలో 154 సెంటిమీటర్ల వర్షం పడింది.

విశాఖపట్టణం జిల్లా. శారదా నదిలో వరదలవల్ల జిల్లాలోని అనకాపల్లి పట్టణంలోకి నీరు ప్రవేశించింది. నౌకాదళానికి చెందిన హెలీకాప్టర్లు ఆహారపు పొట్లాలను పట్టణంలోకి జారవిడిచాయి. పట్టణ ప్రజల సహాయార్థం 15 తేలికపాటి నౌకాదళపు పడవలను, నౌకాదళ, పోలీస్ సిబ్బందితో సహా పట్టణానికి పంపించారు. ముగ్గురు వ్యక్తులు మరణించినట్లు తెలియవచ్చింది.

నవంబరు 19 వ తేదీన సంభవించిన తుఫాను, ఉప్పెన ప్రమాదంలో బందరు తాలూకాలో అపారంగా ఆస్తినష్టం, ప్రాణనష్టం సంభవించిందనీ, నీరు పూర్తిగా తగ్గిపోయిన తర్వాత పెక్కు శవాలు లభించవచ్చుననీ కృష్ణా జిల్లా కలెక్టర్ శ్రీ సి. ఎస్. రావు పత్రికలవారితో చెప్పారు.

సహాయ కార్యక్రమాలకు హెలీకాప్టర్ల కొరకు ప్రభుత్వానికి తెలియ జేశామని ఇప్పటికే బందరులో 4 శిబిరాలు నిర్వహిస్తున్నామనీ, 3 వేల మంది వారికి తోడుగా చేరతారని తెలిపారు. పోలీసు, రెవిన్యూ సిబ్బందితోపాటు రోవర్స్ హోంగార్డ్సు ఎన్. సి. సి. విద్యార్థులు సహాయ కార్యక్రమాలలో నిమగ్నమై వున్నారు.

## ఉప్పునీటి ప్రమాదం

దివి తాలూకాలో సముద్ర కెరటాలు పద్దెనిమిది అడుగుల ఎత్తున వచ్చిపడటంతో మంచినీరు కూడా ఉప్పునీరుగా మారిపోయినదని ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు చెప్పారు. ఇప్పుడు అక్కడ మంచినీటి సమస్య ఏర్పడటం అలా ఉంచి, ఈ ఉప్పునీటి ప్రభావం భూములపై ఏమైనా పడుతుందేమోనన్నది అసలు సమస్య అని ఆయన అన్నారు. దీనివల్ల భూములు చవిటిగా మారే ప్రమాదమున్నదని ఆయన చెప్పారు. మచిలీపట్నంలో ఒక భాగంలో కూడా ఉప్పునీరు ప్రవేశించినదని ఆయన చెప్పారు.

## ఉచిత భోజన సౌకర్యం

తుఫాను బాధితులకు నాలుగైదు రోజుల వరకు ఉచితంగా భోజన సౌకర్యాలను రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేస్తున్నదని ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు చెప్పారు. పాఠశాల, కళాశాల భవనాల్లో వీరి వసతికి ఏర్పాటు చేస్తున్నారు.

కృష్ణా జిల్లా దివి తాలూకాలో 18 అడుగుల ఉవ్వెత్తున లేచి పడిన ఉప్పెనవల్ల వేలాది మంది మరణించారు. 1864 లో ఉప్పెన తర్వాత ఇంత పెద్ద ఉప్పెన ఎప్పుడూ రాలేదు.

సహాయ కార్యక్రమాలకోసం వెంటనే ప్రత్యేక పోలీసు దళాలను పంపించ వలసిందిగా ముఖ్యమంత్రి అక్కడికక్కడ కృష్ణా జిల్లా అధికారులను ఆదేశించారు. సాయుధ రిజర్వు పోలీసు కూడా విజయవాడ నుంచి బయలుదేరి వెళ్లారు. బందరు, దివి తాలూకాలలో సహాయ కార్యక్రమాలను చేపడతారు.

## విశాఖపట్నంలో ప్రజాజీవితం స్తంభన

నవంబరు 19 వ తేదీ శనివారం నుండి విశాఖపట్నంలో పాయక్‌రావుపేట, ప్రజల జీవితం స్తంభించి పోయింది. తాండవ,

శారదా ఇతర నదులు గట్లు తెంచుకొని ప్రవహించాయి అధికారులు నష్టాల గురించి అంచనా వేశారు. బాగా దెబ్బతిన్న ప్రాంతాలు పాయకరావుపేట, అనకాపల్లి, యలమంచిలి మొదలగునవి.

గురువారంనాడు విశాఖపట్నం నుండి వెళ్లిన ఒకనాటు పడవ పోర్టుఛానల్ ముఖద్వారం వద్ద తలక్రిందులయింది.

రాజమండ్రీలో 189 మిల్లీమీటర్ల వర్షం పడింది. పట్టణం అనేక ప్రాంతాలలో మోకాలులోతు వరకు నీరు వచ్చింది. అనేక ప్రాంతాలలో పూరిళ్లు కూలిపోయాయి.

## శారదా నది వరదలు

శారదానది వరద నీరు అనకాపల్లి పట్టణంలో ప్రవేశించగా, సహాయ కార్యక్రమాలను జిల్లా కలెక్టరు, పోలీసు సూపరింటెండెంటు పర్యవేక్షించారు. జలమయమైన ప్రాంతాలలో చిక్కుబడిన వారిని రక్షించడానికి సహాయక చర్యల కోసం తక్షణం బోట్లు పంపాలని నౌకాదళ అధికారులకు, పోర్టుట్రస్టు అధికారులకు వారు కబురు పెట్టారు.

మచిలీపట్నంలోనూ పరిసర ప్రాంతాలలోను ఎన్నో మృత దేహాలను కనుగొన్నారు. రంగనాయకంపేట, రాజంపేట గ్రామాల్లో 150 మందికి పైగా మరణించారని అప్పటికప్పటి అంచనా.

శ్రీకాకుళం జిల్లాలో కూడా కుండపోతగా వర్షం కురిసింది, చేనేత పారిశ్రామికులకు వాటిల్లిన నష్టం 30 లక్షల రూపాయల మేర ఉంటుందని అంచనా.

గడచిన 113 సంవత్సరాల కాలంలో కనీవినీ ఎరగనంతటి ఘోరమైన తుఫాను తాకిడికి గురైన కోస్తా ప్రాంతంలో రాష్ట్ర ప్రభుత్వం భారీఎత్తున సహాయ కార్యక్రమాలను ప్రారంభించింది.

ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు విమానంనుండి తుఫాను బాధిత ప్రాంతాలను 12 గంటలపాటు పరిశీలించి నగరానికి తిరిగి వచ్చారు. ప్రజలు, పారిశ్రామికులు, వర్తకులు, రాజకీయ పక్షాల వారు, స్వచ్ఛంద సంస్థలు ఉదారంగా సహాయమిచ్చి ఆపదలో ఉన్న తోటి పౌరులను ఆదుకోవాలని ఆయన విజ్ఞప్తి చేశారు.

మృతుల సంఖ్య లెక్కకు మిక్కిలిగా ఉన్నది. వందలాది గ్రామాలు జలమయమై ఉన్నాయి. ముఖ్యంగా గుంటూరు, కృష్ణా జిల్లాలు బాగా దెబ్బతిన్నాయి.

ఆస్తులకు, పంటకు కలిగిన నష్టాన్ని ఉజ్జాయింపుగా అంచనా వేయడానికైనా ఇప్పుడు సాధ్యపడదు. నష్టం కొన్ని వందల కోట్లలో ఉంటుంది.

ఈ ప్రకృతి వైపరీత్యాన్ని ముఖ్యమంత్రి జాతీయ విపత్తు అని వర్ణించారు. ఎన్నో లక్షల ఎకరాలలో వరిపైరు నష్టమైంది. చెరకు, అరటి, కొబ్బరి తోటలు కూడా దెబ్బతిన్నాయి.



నోటి కూడు నీటిపాలు

నీటిమధ్య చిక్కుబడిపోయిన గ్రామస్థులకు విమానాలద్వారా ఆహారం పొట్లాలను పడవేయటం జరిగింది. వెల్లువ పాలైన నది పోగా మిగిలిందేమైనా ఉంటే దాన్ని కాపాడటానికి చర్యలు తీసుకున్నారు.

చిక్కుపడిపోయిన వారిని రక్షించడానికి సహాయక చర్యలు సాగించడానికి రిజర్వుపోలీసు బెటాలియన్ ఒకటి రంగంలోకి ప్రవేశపెట్టబడింది. నాటు పడవల సహాయంతో ప్రజలను సురక్షిత ప్రాంతాలకు చేర్చారు. ఆయా ప్రాంతాలకు చెందిన మంత్రులు స్వయంగా పర్యవేక్షించారు. గుంటూరు, కృష్ణా, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలకు కమీషనర్లను పంపారు. వారు నాలుగైదు రోజులు అక్కడేఉండి అక్కడికక్కడ నిర్ణయాలు గైకొని సహాయక కార్యక్రమాలను సత్వరం అమలు జరిపారు.

మందులను, వైద్యులను తీసుకొని జీపులు బయలుదేరి వెళ్ళినవి.

ముఖ్యమంత్రి హెలికాప్టర్‌లోనుండి ఒంగోలు, వేటపాలెం, చీరాల, బాపట్ల, రేపల్లె, గుంటూరు, అవనిగడ్డ, మచిలీపట్నం, విజయవాడలను సందర్శించారు. హెలికాప్టర్ అవనిగడ్డ, మచిలీపట్నంలలో దిగలేక పోయింది.

దివిప్రాంతం 18 అడుగుల ఎత్తుతో వచ్చిన ఉప్పెనతాకిడికి గురైంది. మనుషులు, పశువుల మృతదేహాలు లెక్కపెట్టడం కష్టమైంది. పంటల కోతపనులకు వచ్చినవారు చాలామందిఉన్నారు. వారెవరో గుర్తించడానికి వీలులేకుండాపోయింది.

ఆహారపదార్థాలు చేరవేయటానికి గన్నవరంలో, గుంటూరులో, మచిలీపట్నంలో మూడు హెలికాప్టర్లను ఉంచారు. విద్యుచ్ఛక్తి సరఫరా ఆగిపోయి, నీటిసరఫరాకూడా నిలిచిపోయింది. విజయవాడలో నీటి సరఫరా శాఖకు, టెలిఫోన్ ఎక్స్చేంజికీ, పత్రికలకు ,ఆలిండియా రేడియోకు విద్యుచ్ఛక్తి సరఫరాలను పునరుద్ధరించే ప్రయత్నం చేశారు. జనరేటర్లు ఏర్పాటు చేశారు.



దక్కిందే చాలు అన్నట్టుగా అంతో యింతో మిగిలిన పంట రక్షించుకోవడం భారమైపోయింది.



వట వృక్షాలు నేలకూలి ప్రకృతి ప్రళయ భీక రంగా మారింది.



విజయవాడ సమీపంలోవున్న రామవరప్పాడులో అరటితోటలు విధ్వంసమయ్యాయి.





పైరంతా నీటిపాలైంది.

కాందిశీకుల పునరావాస శిబిరం లో దయనీయ దృశ్యం.





సర్వం కోల్పోయి అన్నార్తులైన దీనుల ఆర్తనాదం

★



సర్వం జలమయమైనా మంచినీటికి కరువైంది!



గుంటూరులో ట్యాంకర్ల ద్వారా
సరఫరా అయిన మంచినీటికోసం
ఎదురుచూస్తున్న ప్రజానీకం.

# పలువురు ప్రముఖుల సానుభూతి సందేశాలు

# ఉదారంగా విరాళాలు

ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు దిగువ విజ్ఞప్తి జారీచేశారు.

"వరుసగా రెండవ సంవత్సరం రాష్ట్రంలోని కొన్నిభాగాలు తుఫాను బీభత్సానికి గురి అయ్యాయి. తత్ఫలితంగా సంభవించిన అపారమైన ప్రాణ నష్టం, ఆస్తి నష్టం ఊహించలేనిది. బాధితులకు, ప్రాణాలు కోల్పోయిన వారి సన్నిహిత బంధువులకు మన ప్రగాఢ సానుభూతి ఎప్పుడూ ఉంటుంది. ఈ తుఫానువల్ల మున్నెన్నడూ కనీ వినీ ఎరుగని విధంగా ప్రాణనష్టం కలిగింది. గత సంవత్సరం ఇలాంటి విపరీత పరిస్థితి ఏర్పడినపుడు నేనుచేసిన విజ్ఞప్తికి వ్యక్తులు, వ్యవస్థలనుంచి గణనీయమైన చేయూత లభించింది. ఈ సంవత్సరం సంభవించిన తుఫాను బీభత్సాన్ని ఎదుర్కోడానికి గతంలో లాగే విరివిగా విరాళాలు అందజేయ వలసిందిగా ప్రతి ఒక్కరికీ నేను విజ్ఞప్తి చేస్తున్నాను.

"బాధితులకు సహాయం అందజేయడానికి రాష్ట్ర ప్రభుత్వం చర్యలన్నీ తీసుకుంటున్నప్పటికీ దానికితోడుగా తమ సహాయ సహకారాలను కూడా అందజేయాలనీ వ్యక్తులందరికీ, సంఘాలు, సంస్థలు అధికార సంస్థలతోసహా వ్యవస్థలన్నిటికీ విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ మానవతా కార్యానికి వీలుగా నా విజ్ఞప్తికి మంచి ఫలితం లభిస్తుందని నా ప్రగాఢ విశ్వాసం.

"విరాళాలన్నిటినీ ప్రభుత్వ కార్యదర్శి, రెవిన్యూశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు అనే చిరునామాకు పంపాలి. చెక్కులను ముఖ్యమంత్రి పేర ముఖ్యమంత్రి సహాయ నిధికి పంపాలి. విరాళాలుగా పంపే ఔషధాలు, దుస్తులు, ఇతర వస్తువులను ప్రభుత్వ రెవిన్యూ శాఖ కార్యాదర్శికిగానీ నేరుగా జిల్లా కలక్టరుకు గానీ పంపవచ్చు."

## ఆంధ్ర ప్రదేశ్‌కు రూ. 5 కోట్ల సహాయం

తుఫాను వల్లదాపరించిన అపారనష్టం పట్ల ఆందోళన చెందిన కేంద్ర ప్రభుత్వం హడావుడిగా ఆంధ్రప్రదేశ్, తమిళనాడు రాష్ట్రాలలో సహాయక కార్యక్రమాలకై చెరి ఐదుకోట్ల చొప్పున మొత్తం పదికోట్ల రూపాయలు మంజూరు చేశారు.

ఇది కేవలం తక్షణ సహాయమే. నష్టం వివరాలు పూర్తిగా తెలిసిన తరువాత దీనితో నిమిత్తం లేకుండా కేంద్రం వేరే సహాయం అందజేస్తుంది.

## ప్రధాని నిధినుండి రూ. 2 లక్షలు

రాష్ట్రంలోని కోస్తా జిల్లాలలో తుఫాను బీభత్సానికి గురై ఆస్తులను, పంటలను, కుటుంబ వ్యక్తులను కోల్పోయిన వారందరికీ ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయి తమ సానుభూతిని తెలియజేస్తూ రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుకు ఒక సందేశం పంపారు.

అప్పటికప్పుడు ప్రధాని నిధి నుండి 2 లక్షల రూపాయల చెక్కును తుఫాను బాధితుల సహాయానికై ప్రధాని పంపినట్లు ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు పత్రికా ప్రతినిధులకు చెప్పారు.

కాశ్మీరు ముఖ్యమంత్రి శ్రీ షేక్ అబ్దుల్లా, తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ ఎం.జి. రామచంద్రన్, కేరళ ముఖ్యమంత్రి శ్రీ ఆంథోని కూడా తమ సానుభూతి సందేశాలు పంపినట్టు ముఖ్యమంత్రి చెప్పారు.

## తుఫాను సహాయక నిధి—రెవిన్యూ మంత్రి విజ్ఞప్తి

రెవిన్యూ మంత్రి శ్రీ పి. నర్సారెడ్డి క్రింది విజ్ఞప్తి చేశారు:

"ఆంధ్రప్రదేశ్ కోస్తా జిల్లాలలో ప్రకృతి విలయతాండవం చేసి ప్రజల ప్రాణాలకు, ఆస్తులకు అపార నష్టాన్ని కలిగించింది. ఈ జిల్లాలలో జరిగిన భారీ నష్టాన్ని కళ్లతోచూస్తేగానీ నమ్మజాలము. ఈ శతాబ్దంలో ఇటువంటి ఘోర విపత్తును కనీవినీ ఎరుగము. దీనికి గురైన ప్రజల దుఃఖం, నష్టం భరింపరానివిగా ఉన్నాయి. వేలమంది మరణించడం, లక్షల మంది నిరాశ్రయులు కావడం జరిగింది. తుఫాను బాధితుల కష్టాలను తొలగించడానికి ప్రభుత్వం శక్తి వంచన లేకుండా కృషి చేస్తున్నది. జిల్లా పరిపాలనా యంత్రాంగమంతటినీ తుఫాను బాధితులకు సహాయచర్యలు అందించడానికి వీలుగా సమాయత్తం చేశారు.

ముఖ్యమంత్రి సహాయ నిధికి ప్రతి ఒక్కరూ తృణమో ఫణమో అందజేయాలని విజ్ఞప్తి చేస్తున్నాను. దుఃఖంలో ఉన్న తోటి సోదరులను ఆదుకోవడానికి మనమంతా సిద్ధం కావాలి.

స్వచ్ఛంద సంస్థలు, దాతలు, ప్రభుత్వ ఏజెన్సీలను ధన రూపేణా, వస్తు రూపేణా ఉదారంగా విరాళాలు అందజేయాలని కోరుతున్నాను. జిల్లాస్థాయిలో జిల్లా కలెక్టర్లు, రాష్ట్రస్థాయిలో రెవెన్యూశాఖ ప్రభుత్వ కార్యదర్శి విరాళాలను స్వీకరిస్తారు. ఈ ఆపత్సమయంలో కష్టంలోఉన్న వ్యక్తికి తగిన సమయంలో సహాయాన్ని అందజేయడం ప్రతి ఒక్కరి విధి".

తుఫానువల్ల రాష్ట్రంలో సంభవించిన అపార ప్రాణ ఆస్తి నష్టానికి కార్మిక శాఖమంత్రి శ్రీ టి. అంజయ్య దిగ్భ్రాంతి ప్రకటించారు. తుఫాను బాధితులకు అన్ని విధాలా సహకరించాలని

ఆయన విజ్ఞప్తి చేశారు. పారిశ్రామిక కార్మికులందరు తమ ఒక రోజు వేతనాన్ని ముఖ్యమంత్రి సహాయనిధికి విరాళంగా ఇవ్వాలని, ఒకరోజు అదనంగా పనిచేసి ఆ రోజు వేతనాన్ని తుఫాను బాధితుల సహాయనిధికి ఇవ్వాలని ఆయన విజ్ఞప్తిచేశారు.

కోస్తా ఆంధ్ర ప్రాంతంలో సంభవించిన తుఫానువల్ల జరిగిన ప్రాణధన నష్టానికి ఆర్థిక శాఖమంత్రి శ్రీ రంగారెడ్డి తీవ్ర సంతాపం ప్రకటిస్తూ తుఫాను బాధితులకు స్వచ్ఛందంగా ఉదారంగా యధాశక్తి విరాళాలు ఇవ్వాలని రాష్ట్రప్రజలకు విజ్ఞప్తి చేశారు. సహాయ కార్యక్రమాల్లో అన్ని పార్టీలవారు పాల్గొనాలని ఆయన కోరారు.

తుఫాను బాధితుల సహాయ కార్యక్రమాలను యుద్ధ ప్రాతిపదికపై చేపట్టాలని వాణిజ్యపన్నులు సమాచార శాఖామంత్రి శ్రీ ఎం. మానిక్‌రావు విజ్ఞప్తి చేశారు.

## మధ్యతరహా నీటి వనరుల శాఖా మంత్రి నెల జీతం విరాళం

తుఫాను బాధితుల సహాయార్థం రాష్ట్ర మధ్యతరగతి నీటి వనరుల శాఖ మంత్రి శ్రీ వాసిరెడ్డి కృష్ణమూర్తి నాయుడు ఒకనెల వేతనం రూ. 1500లను విరాళంగా ప్రకటించారు.

కోస్తా జిల్లాలలో తుఫాను విలయతాండవంపట్ల శ్రీ కృష్ణమూర్తి నాయుడు తీవ్ర విచారం ప్రకటించారు. మృతుల కుటుంబాలకు ఆయన ప్రగాఢ సానుభూతి తెలిపారు.

పంచాయతీరాజ్ మంత్రి శ్రీ ఆర్. నారపరెడ్డి తుఫాను బాధిత ప్రాంతాలను సందర్శించడానికి వెళ్లేముందుగా ఇక్కడచేసిన ప్రకటనలో ప్రభుత్వ యంత్రాంగం తక్షణ సహాయ కార్యక్రమాలను చేపట్టాలని వరద ముంపు ప్రాంతాలలోని కుటుంబాలను సురక్షిత ప్రాంతాలకు చేర్చడానికి ప్రత్యేక సహాయ కార్యక్రమాలను చేపట్టాలని కోరారు. పంటలను నష్టపోయిన రైతులకు తగిన ఆర్థిక సహాయం చేయాలని కోరారు.

తుఫానుకు గురైన ప్రాంతాలకు వెంటనే వెళ్లి సహాయ కార్యక్రమాలు నిర్వహించాలని రాష్ట్ర కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి శ్రీ తమ్మారెడ్డి సత్యనారాయణ అన్ని పార్టీలు, శాఖలకూ విజ్ఞప్తి చేశారు.

తుఫాను బాధితులకు జంటనగరాల పౌరులుయధాశక్తి విరాళాలు ఇవ్వాలని నగర కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు కె. సీతయ్యగుప్త విజ్ఞప్తి చేశారు.

తుఫాను బాధితులకు అన్నివిధాలా సహాయపడవలసిందిగా ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు శ్రీ మహమ్మద్ రహమతుల్లా విజ్ఞప్తిచేశారు.

శాసనసభ్యులు శ్రీ వై. సత్యనారాయణ, శ్రీమతి ఈశ్వరీబాయి తదితరులు జారీచేసిన ప్రకటనల్లో తుఫాను బాధితులకు విరివిగా విరాళాలు ఇవ్వాలని కోరారు.

---

## అమెరికా అధ్యక్షుని సంతాప సందేశం

అమెరికా అధ్యక్షులు శ్రీ జిమ్మీకార్టర్ భారత రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డికి వ్రాసిన లేఖలో యిటీవల మన దేశంలో తుఫాను బీభత్సం వల్ల వాటిల్లిన నష్టంపట్ల తమ ప్రగాఢ సానుభూతి సంతాపం వ్యక్తంచేస్తూ, తమదేశం యీ విషయంలో సహాయం అందజేస్తుందని ప్రకటించారు.

భారతదేశంలోని అమెరికా రాయబారి శ్రీ గోహీన్ ద్వారా తుఫాను బాధిత ప్రజానీకానికి అమెరికా వెనువెంటనే తక్షణచర్య గైకొనగలదా అన్నవిషయం గూర్చి తెలుసుకొంటామని ఆయన అన్నారు.

---

## రాష్ట్ర జర్నలిస్టుల విరాళం

రాష్ట్ర వర్కింగ్ జర్నలిస్టుల సంఘం తుఫాను బాధితుల సహాయంకోసం ముఖ్యమంత్రి సహాయ నిధికి ఐదువందల రూపాయలు ఇచ్చింది.

జర్నలిస్టుల సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ ప్రభాకరరావు తీవ్ర సంతాపం ప్రకటించారు.

## పార్టీల సహకారానికై విజ్ఞప్తి

తుఫాను బాధిత ప్రాంతాలలో సహాయ కార్యక్రమాలు చేపట్టడానికి జనతాపార్టీ కార్యకర్తలకు అన్ని పార్టీలవారు అధికార సంస్థలు సహకరించాలని రాష్ట్ర శాసనసభ ప్రతిపక్ష నాయకుడు శ్రీ ఇ. అయ్యపరెడ్డి, జనతా శాసనసభ్యులు శ్రీ ఎ. శ్రీరాములు, శ్రీ విజయ శిఖామణి, శ్రీ సయ్యద్ హసన్, శ్రీ ఎన్. జైపాల్‌రెడ్డి శ్రీమతి టి. ఇ. ఎన్. ఆనందాబాయి నేడొక సంయుక్త ప్రకటనలో విజ్ఞప్తి చేశారు. ప్రకృతి విలయతాండవంలో జరిగిన అపార ప్రాణధన నష్టానికి వారు తీవ్రంగా సంతాపం ప్రకటించారు.

## తుఫాను బాధితులకు కేర్ సంస్థ సహాయం

ముఖ్యమంత్రి చేసిన విజ్ఞప్తి పురస్కరించుకొని కేర్ సంస్థ తక్షణం కోస్తాజిల్లాల్లో విమానాలద్వారా జారవిడవడానికి యాభైవేల రొట్టెలను పంపించింది. మరొక యాభైవేల రొట్టెలను అమరునాడు పంపించింది. వీటిని కూడా విమానాలద్వారా జారవిడుస్తారు. ఈ ఆహారంతోపాటు 5,000 చీరెలను, 5,000 ధోవతులను, 5,000 చొక్కాలను, 5,000 దుప్పట్లను కూడా తుఫాను బాధితుల సహాయార్థం పంపిస్తున్నారు. వీటి విలువ రూ. 3.2 లక్షలు ఉంటుంది.

## ముఖ్యమంత్రి సహాయ నిధికి విరాళాలు

ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీమతి శారదా ముఖర్జీ, గవర్నర్ అనుబంధిత అధికారాలు, రాజభవన్ సిబ్బంది సభ్యులు తమ జీతాలలో ఒక రోజు మొత్తాన్ని ముఖ్యమంత్రి సహాయ నిధికి విరాళంగా ఇవ్వాలని నిశ్చయించారు. గవర్నర్ కృష్ణా, గుంటూరు జిల్లా కలెక్టర్లకు కొన్ని ముఖ్య ఔషధాలను విరాళంగా ఇచ్చారు. వీటిని ఆ జిల్లాలకు సత్వరం పంపిస్తున్నారు.

## ఆం. ప్ర. చలనచిత్ర పరిశ్రమాభివృద్ధి సంస్థ సిబ్బంది ఒకరోజు వేతనం విరాళం

ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర చలన చిత్ర పరిశ్రమాభివృద్ధి సంస్థ సిబ్బంది, సంస్థ మ్యానేజింగ్ డైరెక్టరు శ్రీ పి రాజా రామదాస్ అధ్యక్షతన సమావేశమై, ఆంధ్ర ప్రదేశ్ కోస్తా జిల్లాల్లో తుఫాను తీవ్రత్వానికి గురై విపరీతంగా ఆస్తులను, ప్రాణాలను పోగొట్టుకున్న కుటుంబాల సహాయార్థం ముఖ్యమంత్రి సహాయనిధికి ఒక రోజు వేతనం విరాళ గా యివ్వాలని తీర్మానించారు.

తుఫానులో మృత్యువాతబడ్డ వారి పట్ల సానుభూతి సూచకంగా రెండు నిముషాలమౌనం పాటించారు. ఆప్త బంధువర్గాన్ని పోగొట్టుకున్న వారి పట్ల తమ ప్రగాఢ సంతాపాన్ని వ్యక్తం చేశారు.

## సినీ ఆర్టిస్టుల ట్రస్టుచే రు. 50 వేలు విరాళం

తెలుగు సినీ ఆర్టిస్టుల సంఘం తుఫాను బాధితుల సహాయార్థం రూ. 50 వేల విరాళమివ్వడానికి నిశ్చయించినట్లు ట్రస్టు ఛెయిర్మన్ శ్రీ కె. జగ్గయ్య ప్రకటించారు. విలేఖరులకు ఈ విషయం వెల్లడిస్తూ ఈ మొత్తానికి ఒక చెక్కును ముఖ్యమంత్రికి స్వయంగా ఈ నెల 25 న అందజేస్తామని చెప్పారు.

## టిటో సానుభూతి

తుఫాను వల్ల దక్షిణభారత దేశంలో పెద్దఎత్తున ధన ప్రాణనష్టం జరిగినందుకు తమ ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తూ యుగోస్లావియా అధ్యక్షుడు జోసెఫ్ టిటో రాష్ట్రపతి శ్రీ సంజీవరెడ్డికి టెలిగ్రాంపంపారు.

## స్విస్ అధ్యక్షుని సంతాపం

భారతదేశంలో తుఫానుకు గురైన ప్రజలకు స్విస్ ప్రజల తరఫున ప్రగాఢ సంతాపాన్ని తెలుపుతూ అధ్యక్షుడు కార్ల్ ఆగ్లర్ నిన్న రాష్ట్రపతి శ్రీ సంజీవరెడ్డికి ఒక టెలిగ్రాంపంపారు.

## ఫిన్లెండ్ విరాళం

ఇండియాలో తుఫాను బాధితుల కోసం ఫిన్లెండ్ రెడ్ క్రాస్ సొసైటీ లక్ష మార్కులు ( 25 వేల అమెరికన్ డాలర్లు ) విరాళంగా కేటాయించిందని రెడ్ క్రాస్ ప్రతినిధి ఒకరు చెప్పారు.

## నేపాల్ రాజు విచారం

నేపాల్ రాజు శ్రీ బీరేంద్ర భారత రాష్ట్రపతికి ఒక సందేశం పంపుతూ ఆంధ్ర ప్రదేశ్‌లో తుఫాను వల్ల జరిగిన ఆస్తి ప్రాణ నష్టాలపట్ల తీవ్ర విచారాన్ని తెలియజేశారు.

భారత ప్రభుత్వానికి, ప్రజలకు శ్రీ బీరేంద్ర తనప్రగాఢ సానుభూతిని వెల్లడించారు. నేపాల్ ప్రభుత్వం ప్రజలు భారత దేశానికి, ప్రభుత్వానికి సానుభూతి తెలుపు తున్నట్లు ఆయన సందేశంలో పేర్కొన్నారు.

## నెదర్లాండ్స్ రాణి సందేశం

నెదర్లాండ్స్ రాణి జులియానాగారు భారత రాష్ట్రపతికి ఒక సందేశం పంపుతూ ఆంధ్రప్రదేశ్‌లో తుఫానువల్ల నష్టాలపట్ల గాఢ సంతాపాన్నితెలుపుతూ, పెద్ద సంఖ్యలో మరణాల పట్ల సానుభూతి తెలిపారు.

మారిషస్ తాత్కాలిక గవర్నరు జనరల్ ఒక సందేశం పంపుతూ, తుఫాను నష్టాల నుంచి భారతదేశం త్వరగా కోలుకోగల దన్న ఆశాభావాన్ని వెలిబుచ్చారు.

## దివిసీమలోని ప్రతిగ్రామంలో పక్కాభవనం

విజయవాడ, నవంబరు 24— శాశ్వత రక్షణ కార్యక్రమంగా దివి తాలుకా సముద్రతీర ప్రాంతాలలోని ప్రతి గ్రామంలో ఒక భవనం నిర్మించాలని రాష్ట్రపతి శ్రీ నీలంసంజీవరెడ్డి సూచించారు. 1979 మార్చినాటికైనా వీటిని పూర్తిచేయాలనిఆయన సలహా ఇవ్వగా ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు వెంటనే వాటినిర్మాణం చేపడతామని, 1978 నవంబరునాటికే పూర్తిచేస్తామని హామీ ఇచ్చారు.

మొన్నటి ఉప్పెనలో దేవాలయాలు ముఖ్యంగా రామాలయాలు ఏ విధంగా ప్రజలను కాపాడిందీ, రోడ్లు భవనాల శాఖ మంత్రి శ్రీ చనుమోలు వెంకటారావు రాష్ట్రపతికి వివరించారు. ఏదైనా మంచిదేననీ. పోతే అలయాలు కట్టించినా అవి ఉపయోగపడతాయని ఒక్కొక్కటి లక్షలరూపాయలకు మించిదని రాష్ట్రపతి అన్నారు.

## రాష్ట్రంలో తుఫానుబాధితులకి ప్రపంచ సంస్థల సహాయం

బాలల సంరక్షణ నిధివారు పిల్లలకు గాను 200 టన్నుల వస్త్రాలను ఇవ్వనున్నట్లు ప్రకటించారు ఇవిగాక మరో 5 వేల దుప్పట్లనుకూడా పంపుతున్నట్లు ఈ సంస్థ ప్రకటించింది.

## తుఫానుబాధితుల సహాయార్థం సాంస్కృతిక ప్రదర్శనలు: రామారావు, అక్కినేని ప్రకటన

తుఫాను బాధితుల సహాయార్థం సినీకళాకారులు సాంస్కృతిక ప్రదర్శనలు ఇచ్చి విరాళాలు సేకరిస్తారని సినీనటులు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, శ్రీ నందమూరి తారకరామారావుచెప్పారు.

సినీ పరిశ్రమ ప్రజల మీద ఆధారపడింది. వాళ్ల ఆదరణ లేనిదే సినీ పరిశ్రమ లేదు. తుఫాను రక్కసి విలయతాండవంవలన పెద్ద సంఖ్యలో ప్రాణహాని, ఆస్తినష్టం సంభవించింది. ఈ తరుణంలో వారికి సహాయం చేయవలసిన బాధ్యత సినీకళాకారులపై వుంది అని శ్రీ నాగేశ్వరరావు అన్నారు.

రామకృష్ణా సినీ స్టూడియోస్‌లో జరిగిన పత్రికా విలేఖరుల సమావేశంలో శ్రీ రామారావు ప్రసంగిస్తూ డిసెంబరు 15, 16 తేదీలలో ప్రారంభిస్తామన్నారు. 15 రోజులపాటు 12 కేంద్రాలలో సాంస్కృతిక ప్రదర్శనల ద్వారాను, జోలెపట్టి విరాళాలు సేకరిస్తామని ఆయన చెప్పారు. ఈ కార్యక్రమంలో పాల్గొనమని ఏ కళాకారుడిని పిలిచేది లేదు, ఎవరికివారే ముందుకువచ్చి పాల్గొనాలని ఆయన అన్నారు.





పక్కా యిళ్లు నేలమట్టమయ్యాయి. నిరాశ్రయులకు సురక్షిత ప్రాంతాల్లో ఆహార పదార్థాలు. తదితర జీవితావసర వస్తువులు అందజేయడం తక్షణ కర్తవ్యమైంది.



ఛిద్రమైన యింటిలో శవాలు తొలగిస్తున్న దృశ్యం



గ్రామాలకు గ్రామాలు జలమయ మయ్యాయి



పూరిళ్లు నేలమట్టమై ప్రజలు నిరాశ్రయులైనారు.





తీర ప్రాంతాలలో నౌకలు విచ్ఛిన్నమయ్యాయి



రైళ్లు ఎక్కడి వక్కడ స్థంభించి పోయాయి



PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVT. OF ANDHRA PRADESH, AT GOVT. CENTRAL PRESS, HYDERABAD
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION & PUBLIC RELATIONS ANDHRA PRADESH, HYDERABAD.

